

త్రైలోక్యసుందరి బ్రహ్మగుండమువద్ద భగవంతుని స్మరించి ప్రాణత్యాగంబు సేయబోవుతరి ఆకాశవాణి అనుగ్రహించుట.

శ్రీరస్తు.

# ధర్మాంగద చరిత్రము.

యక్షగానము.

---


తరుణీ మణి రమణా
రాతిని నాతిగనొనర్చు కరక్షితచరణా
భూతేశు చాపహరణా
పాతకహర జనకతనయాపాణిగ్రహణా!

వ. అని కృతి కధిపతియైన శ్రీరంగనాధుని రచనాపరుండేమని వినుతింపుచున్నాడు.

అటతాళము.

పరమపురుష–ముకుంద మాధవ
భక్తలోలా–మురహర
గరుడవాహన–కేశవాచ్యుత
కమలనయనా! ౧
ఉరగశయన–వులూకబంధన
ఉదధిసదనా–శ్రీహరి
తరుచరాశ్రిత–వాలిమర్దన
దనుజహరణా! ౨

నందనందన-అమరవందిత
నందకదరా-హరి గో
విందకౌశిక-యాగరక్షక
మందరధరా! ౩

కంజనాభ-సుదర్శనాయుధ
కంసహరణా-దశముఖ
భంజనా కుండల-సురాశ్రిత
పారిజాతా! ౪

నిగమగోచర-నిఖిలరక్షక
నీలవర్ణా-శ్రీధర
ఖగతురంగ-జనార్దనా
కావేటిరంగా! ౫

వ. అని లక్ష్మీదేవి నేమని స్తుతియింపుచున్నాడు.

జంపె.

పాలనిధిసుతనుభా-ర్గవిని పద్మాలయను
అలగాబరినాలి-ననవరత-మెంతున్ ౧
మచ్చకంటినిలోక-మాతమాయిందిరను
పచ్చవిల్తుని జనని-లచ్చిమిని గొలతున్ ౨
సతతమును బ్రోవజగ-మతిబిరుదు-గలస్వామి
సతియైన భూసుతను-మతిసీత దలతున్. ౩

వ. అని వినుతించి మహేశ్వరుని కీర్తింపుచున్నాడు.

క. భీముని పరేతభూమిఁ
దాముని విధి పునుకధరుని ధరధరతనయన్
కాముని అరభది మోముల
సామిని శివుభవుని నెదను సన్నుతి జేతున్.

వ. అని పార్వతి నేమని భజియింపుచున్నాడు.

ఏకతాళము.

మంచుగుబ్బలి సుత-కంచుకి కంకణి
చంచలనేత్రిని-నెంచి నె గొలతున్. ౧

మారిని కాత్యా-యని భగవతి కౌ
మారిని శంకరి-నారిణి నెంతున్. ౨

కాళిని జగదీ-శ్వరిని పరాపరి
నీలిని పార్వతి-నింపుగ గొలతున్. ౩

వ. అని వనజసంభవు నేమని వర్ణింపుచున్నాడు.

జంపె.

పాలునీరును నేరు, పరచు నేరుపుగల మ
రాళగమనుని, విధిని, మదిని నే దలతున్ ౧

తెలిదమ్మిపూవుపై, వెలుగొందకొలువుండు
పలుకుతొయ్యలిమగని, నలువ నే దలతున్ ౨

సృష్ట్యాత్మకోటులను, సృష్టించుస్రష్ట నే
నిష్టముగ నామదిని, నిష్ఠతో గొలతున్. ౩

వ. అని వాణికా దేవి నేమని కొనియాడుచున్నాడు.

క. శారదవీణాపాణి
వారిజభవు వనితలోకవందిత జననీ
భారతినీరజ నయనీ
కారుణ్యముతోడ నన్నుఁగావుము తల్లీ!

వ. అని భువనప్రధాన దేవతలం గొనియాడి గజముఖు నేమనికీర్తింపుచున్నాఁడు.

అటతాళము.

ముజ్జగంబుల-కొజ్జయౌ పెద
బొజ్జసామీ-గజముఖ
సజ్జనాశ్రిత-గ్రామకూపః
పజ్జవాసా! ౧

దండ శూ-కెజ్ఞోపవీత
స్కందసామీ-కగ్రజ
వందితామరు-నేక దంతుని
వర్ణితింతుఁ! ౨

గట్టువిల్లుని-తనయ గణపతి
పొట్టిసామీ-పార్వతి
పట్టి నీ పాదములు-నా మది
బెట్టి గొలుతుఁ! 3

వ. అని వినుతించి.

త్రిపుట.

సూతవాల్మీకుల-నగస్త్యుల
శుకుల వ్యాస-వసిష్ఠ శక్తుల

గౌతముల-సనకాది నారద
ఘనుల దలచీ! ౧
కాళినందను-ప్రౌఢకవులను
ఘనుని బమ్మెర-పోతరాజుల
కాళిదాసుల-భీము నన్నయ
కవులదలచీ! ౨
శ్రీపెరుంబూదూరి-యతికుల
శేఖరుల నెం-బెరుమనారుల
శ్రీపరాంకుశ-యామునేయుల
శింగ గురులా! ౩
మంత్రరత్నద్వయ-చరమముల
మర్మమిదియని-దారి దెలిపిన
మంత్రప్రదులగు-శ్రీశటార్యుల
మదిని గొలచీ! ౪
అనఘుకశ్యపు-గోత్రవారిధి
నమృతకరుడన-వీరరాఘవు
తనయు వరదభి-ధాముకవి జన
దాసు డరయన్! ౫

వ. అని యిష్టదేవకవిజనార్యుల నూహించీ,

కం. చెప్పెద ధర్మాంగదు కథ
విప్పియు నే యక్షగానశమున విసుపింతున్.
తప్పులు వొప్పులు గలిగిన
కప్పక రక్షించ రయ్యసకవిజనులారా!

వ. షష్ఠ్యంతంబు లేమని విన్నవింపుచున్నాడు.

జంపె.

కమలహితు కులజునకు-కమలధరునకు హరికి
కమలభవుజనకునకు-కమల చరణునకున్. ౧
కమలనిధి శయనునకు-కమలాలయేశునకు
కమలసఖురుచి వేయు-కమల ప్రణుతునకున్. ౨
కమలారి వదనునకు-కమల నయనునకు కర
కమలునకు కావేరి-కమలమధ్యునకున్. 3

వ. అంకితంబుగా గూర్చి రచియింపంబూనిన ధర్మాంగదు
కథా ప్రారంభం బెట్టిదనిన?

సీ. గౌతము డొకనాడుఁ గడుసంతసంబున
నుచిత సద్గోష్ఠినిఁనుండు వేళ
పతినిజూచి యహల్యఁపరమాతిశయమున
బలికె, ఓమునినాధ! ఁప్రాణనాధ
నీ వెరుంగనిదొకటిఁదేలోకమున లేదు
తారలవనిజ ద్రుపదఁతనయకంటె
వసుధలో పతివ్రతఁవనితవున్నామెను
చెప్పవే వినెదనాఁచెవులు దనియ

గీ. అనుచు బలికిన సతినిజూఁచరుష మొంది
కరుణ రత్నాకరుండు యాఁగౌతముండు
పలికె త్రైలోక్య సుందరఁపడతి యొకతె
గలదు వినుమని బలికె నాఁగౌతముండు.

జంపె.

శ్రీసతికి నవ్వైన-క్షితిని యేబదియారు
దేశములమేటి కా-శ్మీర దేశమునా. ౧
అలకైల బిలుతోడ-అలుకచే వచ్చినా
అలకపురిబోలు త్రిద-శాలయము-బోలఁగ.
కనకపురమనుదొకటి-ఘనపట్టణము గలదు
జనకసుతమాతసిర-మనగ భువి వెలుగఁగ. ౨

వ. అట్టిపురం బెట్టిదనిన.

ఏకతాళము.

కోటలు పేటలు-హాటకమయమై
నాటక పాటక-ఘోటక శాలల్. ౧
సదనంబులు సుర-సదనంబులు ప్రా
సాదంబులు మణి-సౌపానంబుల్. ౨
మేడలువాడలు-జాడలు బంగరు
గోడలు వజ్రక-వాటచయంబుల్. 3
పడగలు సూర్య ప-టములు పతాకలు
గొడుగులు తోరణ-కోటిచెలంగఁగ. ౪
గోపురములు కో- త్తళము లగడ్తలు
తోపులు దామర-కూప బిలంబుల్. ౫
తేరులు గజములు-తేజులు వీరులు
పారులురాజులు-భేరులు శూద్రుల్. ౬
గలిగివెలుగు నిల-కనకాపురమతి
చెలువముతో బహు-శ్రేయస్కరమై. ౭

సీ. అట్టిపట్టణమేలు పట్టభద్రుడులోక
సట్టదిట్టంబులు గుట్టెరిగి
జారదురాచార చోరుల దండించి
సాధుసజ్జనులను సంతరించి
పుట్టికి నొకరూక దిట్టంబుగాగొని
నూరుమాడలకొక్క రూక వడ్డి
ఎనిమిదెద్దులు మడక కెంచిగట్టుదురిల
నెలమూడువానలు నెంచిగురియు

పదిటనొకపాలు గొనియు నవ పాలి పంట
కాఁపులకునిచ్చె ప్రజకెల్ల కల్పతరువు
ఆదిరాజులబోలా క్షత్రమ న్త్రి మన్త్రి
మార్గమున నేలె భూమి ధర్మాంగదుండు.

వ. ఈప్రకారంబున ధర్మాంగదుండు కొన్నిసంవత్సరంబులు రాజ్యభారంబుజేసి యాగయజ్ఞాది కర్మంబు లొనరించియు సంతతిలేక తనమనంబున నిటుల తలపోయుచున్నాడు.

జంపె.

ఎంతసంపద గలిగి–నంత నేమిఫలంబు
సంతానముకు లేని–సంపదేమిటికే. ౧

కడలేనిధనమున్న–నడుగ రెవ్వరు జనులు
బిడ్డలెందరనివ మా–రొడువ నోరేదీ. ౨

"సుతులుహీనంబైన–గతినాస్తి" యనివేద
శ్రుతిసంహితేతిహాస–తతిబలుకు నెపుడుఁ. ౩

గనక యిహపరములకు-కాని యీదేహంబు
జనియించు మనుకంటె-చచ్చుటే మేలూ. ౪
అనుచు తా శోకించి-ఆరమానాదుమది
నునిచి ధర్మాంగదుడు-నుండె కొన్నేండ్లూ. ౫

వ. తదనంతరంబున,

త్రిపుట.

ధరణినాధున-కగ్రసతియా
పరమపావని-యైన గుణవతి
నిరతమును శ్రీ-రంగనాధుని
నిష్టతోడన్. ౧
మానినీమణి-రేయుబగలును
మాధవునిమది-నిలిపి గొలువగ
మానుగా గర్భంబు-నిలిచెను
మగువకపుడూ. ౨
వంటకము రుచిలేక-నాకల
కంఠికింపుగ దోచె-నోటికి
మంటిపై కర్పూర-వీడెము
మందమాయెన్. ౩
తుండమును తెలుపెక్కె-నాసతి
గండపాలికి పలకలై-వట
పండు వంటదరంబు-కమరెను
పణతి చనులన్. ౪

కుక్కలును నలుపెక్క-నాభియు
నిక్కబడలికె లెక్క-మైతోడ
లక్కజంబుగ రోమ-ములు
క్రిక్కిరిసెనపుడూ. ౫

సీ. సతిగర్భచిహ్నలు – జనపతి తిలకించి
సుతుడుగల్గునటంచు – సొంపుతోడ
నుండె తొమ్మిది నెలల్ – రూఢిగా జనదశ
నెలలోలిరాగనా – నెలతకపుడు
సుతుడు బుట్టక దండ – శూకంబు బుట్టిన
మంత్రసానులు జూచి – మదిని బెదరి
ఇదియేమిపాపమో – యిలలోన నెందైన
నరులగర్భమున పన్నగము గలుగ
కనియు వినినది లేదు యీ – కర్మమనియు
వనితలును వేగబోయి భూ – వరునిగాంచి
అయ్య యేమని జెప్పుదు – మయ్య నీదు
కాంతకడుపునబుట్టె కా – కోదరంబు.

వ. అనిన విని చింతాక్రాంతుండై

జంపె.

భగవంత నేనెంత-పాపిష్ఠినోగాని
జగతిలో నాకిపుడు-శేషుండు గలుగనే ౧
తొలిజన్మమున నేమి-దురితములు జేసితినొ
తలిదండ్రులకు నేమి-తప్పు జేసితినో ౨

బిడలమ్మిగుడిచితినో-పేదసాదుల నెంత
బడలడచితినో సభల-పక్షమాడితినో ౩
బుధుల దూషించితినో-అతిథులను గడపితినో
ముదితాజనుల కేమి-మోసమెంచితినో ౪
స్త్రీహత్యభూదేవ-శిశుహత్య జేసితినో
గోహత్య భ్రూణాత్య-కోరి జేసితినో ౫
అనఘులౌ భాగవత-అపచారబడితినో
ఘనులతో నేనేమి-కల్లలాడితినో ౬
భాను నేనిరువు రే-పాపములు జేసితిమొ
కామినీగర్భమున-పాముగా గలుగఁ. ౭

వ. అని మఱియు,

త్రిపుట.

నారిగర్భిణి-యైన మొదలుగ
నాటినాటికి-యెదురుజూచిన
కోరికలు బూ-రుగను గాచిన
కీరమాయెఁ ౧

పేలగించ పి-శాచికంటికి
పెద్దదాయె నె-అయ్యయో నా
పాలిదైవము-భూప్రజకునను
పలుచ జేసెఁ ౨

మూసిబెట్టిన-పాయసాన్నము
పాసినటువలె-నామదెంచిన

ఆశలెల్ల ని-రాశలాయెగ
దేమిసేతుఁ. 3

ద్విపద.

అని చింతనొంది యీ-అన్యాయమెందు
వినికనినది లేదు-విశ్వంబులోన
ఈవార్త మంత్రితో-ఎఱిగింతు ననియు
వేగమే బిలుపించ-వేవేగ మంత్రి
వచ్చినవానితో-వసుమతి పతియు
ఇచ్చ చింతించితా-నిట్లనిపలికె
ఏమనిజెప్పుదు-యింతిగర్భమున
పాము బుట్టినదని-పణతు లిట్లనిరి
విన్నది గలదె యీ-వింతలు నీవు
కన్నది గలదెయీ-కర్మమెందైన
సతిగర్భవతియైన-సుతుడు గలుగునని
అధికసంతసమున-ఆశించియున్న
ఆశలెల్ల నిరాశ-లాయనేఁడనియు
భూపతిపై వ్రాలి-పొరలియేడ్చుటయు
కనుగొనిమన్త్రియు-కడుచింతనొంది
జనపతి గనుగొని-సచివు డిట్లనియె.

వ. ఈప్రకారంబున ప్రలాపించెడి రాజునుంజూచి బుద్ధిమతి మన్త్రి.

సీ. రాజేంద్రవినవయ్య రాజశిఖామణి
రాజవంశేంద్ర వో రాజరాజ
దీర్ఘచింతయొనర్చ దీనత్వమెడబాయు
పదరినకార్యంబు చెదరిపోవు
తాలిమిగలిగిన దైవసహాయమా
పన్నగంబనుమాట బయలుపడిన
శత్రువు లైనను జగతి గైకొందురు
యితరులు విని రేని యించుకైన
ఎంచరెవ్వరుగణ్యంబు కొంచమాను
ఆపదలవేళ దైవ మనకడ్డబడును
వగవపనిలేదు యేపని వచ్చినాను
పుత్రు డనిచెప్పి చాటించు పురవరమున.

వ. అనిన విని ధర్మాంగదుండు.

జంపె.

భగవంతుడిపుడగుడు-జగమెరుగ జేసె నను
నగుబాటు జేసెదవ-నలుగురిలో నీవు ౧
ఎల్లలోకము లెరుగ-కల్లబలుకుమటంచు
ఉల్లమున యోచించ-వుచితమా నీకూ ౨
బద్ధంబు దప్పియు-అబద్ధమాడితి నేని
సిద్ధియౌ నిరయం బ-బద్ధమా గతియుఁ 3
కందడొక్కడు లేక-దందశూకము బుట్టి
నిందలకు పాలైతి-నివ్వసుంధరను ౪

ఎట్లుజెప్పితివి యీా-గుట్టువెలిబడకున్న
పట్టియని పట్టణము-లెట్టుజాటింతురో ౫

వ. అనిన బుద్ధిమతిమంత్రి.

త్రిపుట.

ఇద్ధరణిలో-ఎవ్వడైన న
బద్ధమాడని-వాడుగలడే
తథ్యమని నా-మాటవినునీ
బుద్ధిలోనన్! ౧

మనుజవరునకు-మన్త్రికినిగల
మార్గ మెంచగ-మనసు ఒక్కటె
తనువు వేరే-గాకనీకీ
తలపులేలా! ౨

హితవుజెప్పెడి-మన్త్రి దొరకడు
హితవనుచువిను-రాజుదొరకడు
హితవనుచువిను-పతికి గలుగును
యిహపరములూ! ౩

ఆపదలు అరు-దెంచువేళల
దాపుప్రాపుగ-నుండి శ్రీపతి
కాపిరక్షణ-జేయు నీకీ
తాపమేలా! ౪

అనిననాగా-కనియు తనయుడ
టంచు పురిచా-టించబంపియు

తనపురోహితు-శాస్త్రివేత్తల
　　ధరణిసురలకా! ౫

జీరివారల-కోరికలరగ
చూరలుగ బం-గారమిచ్చియు
తేరిచూడుడి-జాతకంబన
　　వారుజూచీ! ౬

భాసురంబుగ-పలికి రప్పుడు
నీసుతుండిల-మోచికాచిన
శేషుడనదగు-వానిమహిమలు
　　జెప్పవశమా! ౭

క. వినవిప్పటికిని కల్లా
దినములు కొన్నియును జరుగ దేవతు లెల్లకా.
కొనియాడ రాజ్యమేలును
జనవరనీ సుతుడు యోగశాలనిబల్కన్.

వ. ఇట్లు జ్యోతిరుషులు జాతకఫలంబరసి జెప్పిన విని.

జంపె.

అనిగుహ్యముగను గ-హ్వరముగా జెప్పవిని
　　జనపతియు సచివు డా-శ్చర్యంబునొందీ
నదనగజతురగములు-రథములాందోళికలు
　　ముదితలును వస్త్రములు-మోదముతో నొసగీ
పంపించిమంత్రినపు-డింపుతో భవనమున
　　కంపి తాబోయె నపు-డంతిపురమునకున్.

వ. ఇట్లు ధర్మాంగదుండు విప్రులకు బహుమతు లొసంగి పంపించి బుద్ధిమతి మంత్రిని యింటికిం బంపించి తా నంతఃపురంబునకుం బోవునప్పుడు.

ద్విపద.

అంతనా గుణవతి-అంతః పురమున
వంతగుందుచు శోక-వనధిలో మునిగి,
నేనునోఁచిన వ్రత-నేమ నిష్టలును
దాన ధర్మములు-వ్యర్థములయ్యె నేడు
బిడ్డలు లేనియా-గొడ్రాలి కంటె
దొడ్డ శోకముబెట్టె-తోడరి దైవంబు
కొడుకులు లేదంచు-గోడొంద గాను
కడపట బుట్టియా-కాలాహి నాకు
బోరు కాడింతునో-చీరె గప్పుదునో
మోర బొట్టిడుదునో-ముద్దు బెట్టుదునో
పాల నుగ్గిడుదునో-జోల బెట్టుదునో
జోల బెట్టుక నేను-లాలి బాడుదునో
ఎత్తి చన్నిత్తునో-యిడుదునో చంక
పొత్తిలం బెట్టి బడ-బోదునో నేను
ఏమి సేయుదు నేను-యింతటికి నోఁచ
కీమెయి నోచితి-నెంత పాపిష్టో
అనియని శోకించ-యువని వల్లభుడు
తన దేవి-నోరార్చి తరుణి నటు జూచి

కటకటా దైవంబు-కరు ణింత లేక
ఇటు జేసితే మన-మే మనవచ్చు
బాపలాడినశాస్త్ర-పలుకులు జెప్పి
తాపంబు వలదన్న-దైవత్న మనుచు
పట్టిగదా యని-పాలు దధి బోసి
పెట్టెబో పామును-బెట్టి పోషించే.

వ. ఆ సమయంబున.

సీ. ఏనుగపై భేరు ♪ లెత్తించి తలవరుల్
పఠపఠ మనినబో ♪ భాగమగల
వాయించుకొనుచును ♪ వాడవాడల జేరి
ఘోయనియార్చుచు ♪ కేక లిడుచు
విజయవిక్రమకళా ♪ వీరుండు శ్రీమహా
హారాజరాజు ధ ♪ ర్మాంగదునకు
వంశవర్ధనుడైన ♪ వరనందనుడు నేడు
బుట్టినా డని వారు ♪ బొబ్బ లిడుచు
విప్రముఖ్యుల క్షత్రియ ♪ వీరవరుల
వైశ్యశూద్రుల వాడల ♪ వరుస నెల్ల
వారలును విననప్పురి ♪ వరమునందు
చాటి రీరీతి తలవరుల్ ♪ సరభసమున.

వ. ఇట్లు పట్టణంబునంజాటగా పౌరులువిని సంతసంబందీ.

జంపె.

కుత లేశునకు బుట్టె, కొడుకనగ విని పౌరు
లధికసంతోషమున - నానందమందీ ౧

వచ్చి మ్రొక్కియు తారు-దెచ్చు కానుక లిచ్చి
మచ్చ టలరగ పతికి-మచ్చికతో ననిరి ౨

భూమేమిపుణ్యంబు-కామించి జేసెనో
మేము జేసిన భాగ్య-మెట్టిదో యిపుడూ 3

పట్టంపుదొర మీకు-బుట్టె నిన్నాళ్లకని
గట్టు తెలియక జనిరి-నెట్టుకొనివారుఁ ౪

మనుజవరుడైన ధ-ర్మాంగదమహీపతికి
తనయుండు గలిగెనని-ధరయెల్ల నెగడఁ. ౫

వ. ఇట్లు ధర్మాంగదమహారాజునకు తనయుండు గలిగె నని భూప్రసిద్ధి నొందగా, విశ్వంభరాధీశులు విని-

ఏకతాళం.

భక్ష్యభోజ్యములు-ఇక్షుకండములు
అక్షయముగ వ-స్త్రాభరణంబుల్ ౧

పంపినరాజులకిం-పె సగగమల్ల
నంపిపురోహితా-మాత్యులతోడఁ ౨

భూతియుఖ్యాతియు-భూతల మెల్లను
నీతియు వెలయగ-నింపుతో నేలెన్ 3

వ. ఈప్రకారంబున రాజ్యంబునేలుచుండగా సకలరాజన్యులు, ధర్మాంగదమహారాజునకు పుత్రుండుబుట్టి పండ్రెండు సంవత్సరంబు లాయెఁగదాయని రాజపుంగవులు తమపుత్రికల నిత్తు మనుచు విద్యాబుద్ధి వివేకంబు లేపాటోయని శుభలేఖలుఁబంపిన ధర్మాంగదుండు బుద్ధిమతిమంత్రినింబిలువ పరిచరులం బంపించి డోలాయమానమానసుండై తనలో తా నేమని తలపోయుచున్నాడు.

అర్ధచంద్రికలు.

అయ్యో యీవిధికి నే-నెయ్యెడల జొత్తును. ౧
పాము గని బాలుడని-పలికి ధరలోనన్ ౨
రవ్వజేసెనె మన్త్రి-యివ్విధిని నన్నున్ 3
ఏమనుచు లిఖయింతు-భూమీపతులకున్ ౪
వరుజూచి పోవచ్చు-వారి కేమందున్ ౫

వ. అనిచింతించుతరి వచ్చిన బుద్ధిమతి మంత్రినింజూచి లజ్జాపరవశుండై

జంపె.

గోత్రాధిపతులు నా-పుత్రునకు మదిని తమ
పుత్రికల నిత్తుమని-పత్రికలువ్రాసీ ౧
పుత్తెంచినారు నే-నెత్తెఱగున నిపుడు
చిత్తమున నెంచి ప్ర-త్యుత్తరము వ్రాతున్ ౨
ఏమియోచన జెప్పె-వోమంత్రి యనియడుగ
భూమీశుతో సనియె-బుద్ధిమతిమన్త్రి. 3

ఇంపొందశుభలేఖ-లిటు దెచ్చువారలకు
పంపు మింపులు బలికి-పసదనంబొసగి. ౪

వినయగుణనేర్పు వి-ద్యావివేకములందు
ఘనుడు నాతనయుండు-మనసిజుని బోలుఁ. ౫

గీ. అనుచు శుభలేఖ లంపించి ॥ అవనిసురల
పనిపి లక్షణవతియైన ॥ పణతి నిపుడు
చూచి దెచ్చినసతివల్ల ॥ సుందరాంగు
డౌనుకుండలి నీకను ॥ మానమేలా.

వ. ఇట్లు బలికినమంత్రినింజూచి ధర్మాంగదుండు.

త్రి పు ట.

ఎల్లలోకము - లెరుగ నేమని
పొల్లువ్రాయుదు - కన్య నిచ్చెడి
తల్లిదండ్రులు - వచ్చినను నీ
తనయు జూడఁ. ౧

వలెననిన నే - వారి కేమని
వదరుదెవ్వని - జూపుదన్నను
ఇలపతిని గని - మంత్రిపతి తా
నిట్టులనియెఁ. ౨

మచ్చికలరగ - నాసుతుని నే
దెచ్చివారికి - మెచ్చజెప్పియు
మచ్చకంటిని - తెత్తమింపగు
అచ్యుతుకృపఁ ౩

తెచ్చితే స - త్కీర్తి లెచ్చును
మెచ్చు లోదవును - లేక యున్నను
వచ్చునపకీ - ర్తియు విజంబుగ
వసుధ - మనకుఁ. ౪

సతివలననొక - గతియు గలుగును
పతికిలక్షణ - వతియువల్లను
కుతలమున గల - రిట్టినేకులు
అతిశయముగా ౫

వ. అని మఱియు.

సీ. అమరావతీపురం బనెడు పట్టణమునందు
రూపసింహుండను భూపతొకడు
గలడాతనికిబహు కాలంబుసంతాన
హీనుడై యాగంబు లొనర జేసి;
వాసుదేవు దలంచి వదలకపూజింప
కాంతకడుపున బుట్టె కమఠ మపుడు
గొడ్డైన మేలిట్టి బిడ్డ బుట్టుటకంటె
దైవమాశ్రీరంగ ధామ యనుచు
గీ. నుండగా నంత హరికృప నువిదవలన
కమఠరూపంబుబాసి కం దర్పుడనగ
నలరెగనకొకదైవమన కడ్డబడును
ఇందుకై నీవు వ్యసన మొందంగ నేలా?
వ. అనినవిని ధర్మాంగదుండు పత్రికలువ్రాసి పంపించి.

అటతాళం.

అనఘులగు భూ-సురులభూధవు
డపుడు బిలచీ-వారికి
ధనము లంబర-వస్తువాహన
తతుల దనిపీ. ౧

ఉపచరించియు-నాదుసుతునకు
నుర్విపతులా-నగరుల
నెపము యిసుమం-తైన జెందని
నెలత నొకతెన్. ౨

లక్షణంబులు-రూపుబుద్ధియు
రాశిరజ్జా-గణదిన
పక్షిదీర్ఘము-హేంద్రమోనియు
వృక్షములునూ. ౩

ఇన్నిలక్షణములును. గలిగిన
కన్యనొకతెన్-జూచియు
వన్నెగాఅమరించి-రండని
వారితోడన్. ౪

జెప్పి పొండన-ధరసుపర్వులు
ఒప్పివారూ-వేగమె
అప్పుడే చప్పు-న్నదేశము
లరయజనిరీ. ౫

ద్విపద.

చోళమరాట, బంగాళనేపాళ
మాళవమలయాళ, మగధాంధ్రకుకుర
సింహాళఘూర్జర, సీనరమత్స్య
అంగకళింగ క, ర్నాటకాంభోజ
ద్రవిడపుళింద వి, దర్భపాంచాల
యవనపౌండ్రకశాల్వ, యార్యయవంతి
కొంకణకేరళ, కోసలపాండ్య
టెంకణబర్బర, దేశాధిపతుల
సదనకన్యలనెల్ల, చాల పరికించి
మదినొల్లకవారు, మదిచింతనొంది
ఎక్కడగానము, యిలపతులిండ్ల
చక్కని సతియని, జగతి మఱినరయు
చుండగా నొక్కభూ, సురుడుసౌరాష్ట్ర
మండలాధిపుపుత్రి, మహాలక్ష్మిబోలు
ఒకకన్యగలదన, నుర్వీశుపర్వు
లకలంకమతితోడ, నరయుద మనుచు
రాణిల్లుచుండు సౌ, రాష్ట్ర దేశమున
మాణిక్యపురముకు, మహిమతో జనిరి.

వ. ఇట్లు మహీసురోత్తములు మాణిక్యపురంబునకుం బోవు నప్పుడూ.

ఇంపే.

రత్నపీఠికముపై, రత్నగర్భాధిపతి
రత్నాంగదుడుమన్త్రి, రత్నములగూడీ ౧

ధీరుడై కొలువున్న, వీరు గని బ్రాహ్మణులు
ఆరోగ్యమస్తుదీ, ర్ఘాయుష్యమస్తూ ౨

అనుచు అక్షతలిచ్చు, ఘనులవిప్రుల జూచి
మనులిచ్చి మన్నించి, మహిపతియు బలికె. ౩

ఏవూరుఏదేశ, మెందువచ్చితిరిపుడు
ఏదిమీకోరికన, భూదేవు లనిరీ. ౪

రాజాధిరాజ ర, త్నాంగదమహారాజ
రాజపూజితమహా, రాజ విను మనియూ. ౫

వ. అని విప్రోత్తములు వెండియు.

సీ. కాశ్మీర దేశాన ॥ కనకాపురంబేలు
ధర్మాంగదుం డను ॥ ధరణిపతికి
సుందరాకారుండు ॥ సుగుణుండు సుభగుండు
తనయుండు పాండిత్య ॥ దనుడు నతని
కెనయైన వనితను ॥ మనుజాధిపులనిండ్ల
నరసియు నమరించి రండటన్న
మాళవమలయాళ ॥ చోళనేపాళబం
గాళపాంచాల క ॥ ర్నాటలాట

యవనకురుకేరళావంతి - యంగవంగ
ఆంధ్రదేశంబులాదిగా - యఖిలసీమ
సుతనుత్రైలోక్యసుందరిఁ - జూడఁగోరి
వస్తిమని వారిరాకయు - విస్తరించి.

వ. వెండియు నవ్విప్రులు

క. సాముద్రిక శాస్త్రోక్తము
భామామణిలక్షణంబుఁ బరికింపవలెఁ
రామాభిరామ నిచటికి
భూమీశా తోడి తెమ్ము - పుత్రిక ననినన్.

వ. అనినవిని రత్నాఁగదుండు వారలకు ప్రియంబులు బలికి
కనకాంబరంబులిచ్చి.

ఏకతాళం.

ఊడిగ భామల-వేగమె బిలచియు
పోడిమి మీరగ-పుత్రిని నిటకుఁ. ౧
తోడుక రమ్మన-వేడుక తోప
న్నీటను జలకము-బోటికి నార్చి. ౨
హాటకమయమం-బరము గట్టియు ర
త్నాటక పేటంచు-రవికెయు దొడిగీ ౩
పసుపులు బూసియు-నొసల కుంకుమ లిడి
పసగ కాటు కకను-లెసగగ బెట్టీ ౪
కురులు నున్నగ దువ్వి-గొప్పగు కొప్పిడి
పరిమళములుగల-విరులుధరించి ౫

పదకమ్ములు పట్టెడలు సరంబులు
పదనూపురములు-బంగరుగజ్జల్ ౬
బావిలిమురుగులు-పల్లెరుపూవులు
ఠీవగుముక్కర-నీవియుకమ్మల్. ౭
కరకంకణములు-కడెము లుంగరములు
వరమణిముద్రిక-వజ్రపుతళుకుల్. ౮
అంగాంగంబుల-కగుసొమ్ముల్లను
శృంగారంబుగ-అంగన కిడిరి. ౯

వ. ఈవిధంబున, కై జేసిన త్రైలోక్యసుందరి డెందంబున పరమానందంబునొంది మందగజగమన సరిగంచు సరిగె పైటాను, శాల్వ, మేలుముసుంగిడి, మగువలంగూడి చుక్కలలోని చంద్రరేఖయుం బోలె, త్రైలోక్యసుందరి వచ్చెనటా యెటువలెను.

జం పే,

అంగజుని తేజియో, చెంగలువబాణమో
రంగుతీగె మెరుంగొ, రత్నాలబంతియో ౧
కలరాజహంసయో, కసడు దుడిచినమణియొ
చిలువమాణిక్యమొ, శీతాంశుకళయో ౨
తావిపూలతికయో, భావజుని దేవతయొ
దేవలోకపురంబొ, దేవతరురెంబో ౩
కుసుమధనువందలపు, కొమ్మయోశృంగార
రసమొ మగరాల, వజ్రాలబంగరమో

బంగారుబొమ్మయన, నంగనతిమోదమున
రంగుమీరగ జనకు, సంగడికి వచ్చెన్. ౫

వ. ఇట్లువచ్చిన కూతునెత్తిచెక్కిలిబుణికి, మచ్చికతో, ముద్దు
బెట్టి ముచ్చటలర వజ్జనిడుకొని, విప్రుల విలోకించి

కం. బాలామణి నాకూతుర్
బోలగ పరికింపుడనిన భూసురులపుడున్
త్రైలోక్యసుందరిని గని
చాలావిస్మయమునొంది సతిబరికించన్.

వ. అప్పుడు నప్పుడమి సురు లప్పొలతిలక్షణంబులు పరీక్షిం
చిరటు యెటువలెను.

త్రి పు ట.

కరములను తిల-కించి రాయువు
కాంతు రేఖయుపుత్ర రేఖయు
సిగులుగులుకగ, మచ్చ రేఖయు
చెలగజూచీ ౧

అన్న రేఖయు-స్వర్ణ రేఖయు
వన్నెమీరగ-జూచి, పదముల
నున్న రేఖలు-జూచి, ముఖల
క్షణాలుజూచీ, ౨

జ్యోతిరిష సా-ముద్రికంబులు
సోద జేసియు-పతివ్రతానర

సతులవేగుల-చిహ్నాలునుచతు
రాంధ్రచిహ్నాల్. 3

ఆయువును సా-మ్రాజ్యమైనువ
అరసుతమణి-మాదికంబులు
శ్రీయుతంబగు-నట్టిలక్షణ
స్థితులు జూచీ ౪

సంతసం బల-రంగ మెచ్చియు
జనపతినిగని-వేదవిప్రులు
పొంతనము ల-క్షణము లున్నవి
యింతికన్నిక ౫

వ, అని మఱియును.

గీ. గోత్రసూత్రంబులన్నియు ॥ కోరి దెలిసి
వారిజాక్షిని మారాజ ॥ వరునిసుతున
కిచ్చి ధర్మాంగదునితోడ ॥ వియ్యమంద
మనసుగలిగున్న యీవచ్చు ॥ మచ్చకంటిక.

వ. అని విప్రులు మఱియు,

ద్వి ప ద.

ధర్మాంగదునితోర-త్నాంగదా నీవు
నర్మిలితో వియ్య-మందితి వేని
రసదాళిలో పండు-రంజిల్లి నట్లు
దశవన్నెపుత్తడిక-తావి గన్నట్లు
ఉండును మీచిత్త-మెట్టిదో యనిన

నిండువేడుకతోడ-నృపచంద్రు డనియే
సమ్మతి నమ్మహా-జననాథు తోడి
సంబంధమును గల్గ-జన్మఫలంబు
సత్యసంధుండు భూ-చక్రేశ్వరుండు
అత్యంతధార్మికుం-డతివిక్రముండు
అట్టిధర్మాంగదు-మహరాజ ముద్దు
పట్టికి వినుడి ప-ట్టపుదేవి గాగ
సుతయైన త్రైలోక్య-సుందరి నిత్తు
నధికసమ్మతము మా-కందరికనియు
వక్కలాకులుతట్ట-లొనరంగబెట్టి
అక్కజమణి కాను-కలు కట్టణములు
వింతగాగొనివచ్చి-విప్రుల కిచ్చి
అంతఃపురంబున-కాత్మజ ననిపి

వ॥ ఇట్లు గత్నాంగదమహారాజు తనపుత్రియైన త్రైలోక్య సుందరిని ధర్మాంగదమహారాజ పుత్రునకీ నిశ్చయించి విప్రులకు ప్రియంబులు బలికి బహుమతు లొసంగి తన మన్త్రి పురోహిత పండితప్రధానులం జూచి,

ఏ క తా ళ ము.

కనకపురమునకు, చని ధర్మాంగదు
గని నాతని సుతు, గని నడవడియుఁ ౧

అరయగవలె రా,జ్యాంగంబెల్లను
ఎరిగియు తరుణీని, యివ్వగ వచ్చుఁ ౨

కన్నుల చూడక, మన్మథు కైనను
కన్య నీవచ్చునె, యిన్నియు నేలా? 3

వ. కావున,

క. మీరీవిప్రుల సరసనె
గారవ మొప్పంగ నేగిశకనక పురమునక
ధీరుని ధర్మాంగదు సుతు
మేరలు గురుతెరిగి రండుశమిన్నక పొండూ.

వ. అనిన వారును యియ్యకొని రథగజాశ్వాందోళికాది వాహనసమేతులై వీడ్కొని చనిరందు కొన్ని దేశంబులు గడచి కనకపురంబునకుం బోవునప్పుడు,

త్రి పు ట.

గోపురము, లుప్పరిగె మేడలు
కోటకొమ్మలు, పేట లిండ్లును
తోపు లుద్యానములు వీథులు
తోరణములూ. ౧

గలుగు కనకా, పురము గని మది
చెలగి నిలిచిరి, కోట వాకిట
నిలిపి వారల, ధరసుపర్వులు
వెలయ జనిరీ. ౨

కోటవాకిలి, పేట వీథులు
దాటి హాటక, మేటి మేడలు

హాటకకూట క, వాటములు దా
టంతిపురికిఁ. 3

వ. ఇట్లు బ్రాహ్మణోత్తములు అంతఃపురంబునకుం బోయి, ధర్మాంగదమహారాజునుంజూచి ఆశీర్వదించి,

సీ. వినుము ధర్మాంగ దోర్వీశ మీ యాజ్ఞ
ప్రకారోక్తమైనట్టికన్య నరయఁ
చని, బర్బరావంతిసాకేత నిషదాంధ్ర
మళయాళ, చోళమరాట, మచ్ఛ,
అంగ, వంగ, కళింగఆర్యపౌండ్రక, శాల్వ
బంగాళ, కుకురపాంచాల, ద్రవిడ
మగధపాండ్యకళింగమాళవ నేపాళ
దవులాలయములకుఁదరలి లలన

నరయ లక్షణ యుక్తమైనట్టి కన్య
నెందుగానక సౌరాష్ట్రమంద మొంది
యుండు మాణిక్య పురమను నవిదనేలు
రాజు రత్నాంగదుండను రాజరాజు.

వ. అని మఱియు,

అ ట తా ళ ం.

అతనిసుతత్రైలోక్యసుందరి
ఆదిలచ్చో,-అంబికో,

రతియొ వాణియొ - రాజురాణియొ
రంభయనగా. ౧

గలుగదా నివి-లాస మింతని
చిలువ రేనీ - కైనను
పలుకశక్యమె - వినుము నీలపు
సరులొ - కురులూ. ౨

ముఖము చంద్రుని - సకమొ చెవులు
మురారి చేతీ - చక్రమొ
సఖియ కను భ్రూ-యుగము నంగజు
చాప యుగమో. 3

చెలియ నాసియు - తిలకుసుమమో
బెళుకు చూపుల్ - మీనులొ
కలికి చెక్కులు - నిలువుటద్దమొ
గళము శంఖో. ౪

పడతి కరములు - పద్మలతలో
బుడుత చన్నుల్ - బంగరు
కుడములో కర - చరణ నఖములు
వుడు గణములో. ౫

కౌను గగనమొ - కంచుకియొనూ
గారు నాభీ - కమలమొ
చానపిరుదులు - నిసుక దిన్నెలో
మీన నేత్రీ. ౬

తొడలు నరటులో - పదము లిగురులో
నడలు కరులో - చెలికి
డెడుగడల స్త్రీ - జాతిలో లే
దిదియు గాకా. ౭

జంపె.

అరవిందముల బోలు - అరచేత అరకాల
మెరుగు రేఖలు సుళ్లు - మేతావి మచ్చల్. ౧
ధన రేఖ సుత రేఖ - ధవు రేఖ సామ్రాజ్య
ఘనమీన రేఖ తో - రణ అన్న రేఖల్. ౨
రంగగు చతుర్విధము - లంగనల చిహ్నాలును
సంగతిగ బరికించి - అంగనసమర్చి. ౩
వచ్చితిమి మీసుతున - కచ్చెలిని దెచ్చితే
మెచ్చు లొదవును మగని - కచ్చెలియ వలనన్. ౪
అనియు సీతనయునిన్ - గనవలని తనవార
లనిపె ఘనులను కొంద - రనఘ మాసరసన్. ౫
వచ్చి పురివాకిటను - వారున్న వారినివు
డిచ్చటికి రప్పింపు - ముచ్చటలరగను. ౬
అనిన వారలకు ధన - కనక వస్తువు లిచ్చి
ననిపి మంత్రిని నటకు - రప్పించి బలికెన్. ౭

వ. ధర్మాంగదుండు నవ్విప్రులం బంపి మంత్రినిం జూచి విప్రుల పలుకు లన్నియుం జెప్పి ఏమనుచున్నాడూ.

జంపె.

ఏమి సేయుదు మంత్రి - ఈపాపమునకు నే
పాము గని బెట్టుకొని - పరుల బిడ్డలను. ౧
తెచ్చి చూపియు వారి - కిచ్చ మెచ్చగ జెప్పి
యచ్చెలిని దెచ్చినఁ - వచ్చు దోషంబుల్. ౨
తరుణి లక్షణవతట - పురగమున కేల చెలి
ధరణీపతుల నొకని - వరునిగా గోరి. ౩
తగిలి వర్ధిలి మనని - మగడు లేనతివ జగ
తగడు బడు వగ లెన్న - డారు మదిలోనఁ. ౪
కనుగంది వ్యసనమున-వుసురనియు కన్నీరు
వసుమతిని నొక బొట్టు-వడిన పాపంబూ. ౫
ఎన్ని జన్మములకును-సన్నమై సున్న యా
కన్యబడు గోడు నే-కనుల నెటు జూతుఁ. ౬
పుట్టు బోగికి యెట్టు-పట్టభద్రుని సుతను
గట్టినని తిట్టుకొడి-గట్టనే జాలా. ౭

వ. కావున.

క. సతిపాపము నాకేటికి
గత జన్మము నందు నేమి శ్రీ కర్మంబులు జే
సితినో అనుభవ మొందెద
సతి యేటికి వలదె యనిన శ్రీ జనపతి తోడఁ.

వ. ఇట్లుపలికిన రాజునుంజూచి బుద్ధిమతిమంత్రి.

సీ. మానవేశ్వర యేటికి మాటలాడెను మేన
పూనని పనియుపై బూనియుండ
ఎంత వచ్చినగాని యేమైన నేనుండ
చింతేల సుతు జాతకంబు లింతి
లక్షణంబులు పరీక్షలు వ్యర్థములు గాదు
పతిపుత్ర సామ్రాజ్య భాగ్యరేఖ
లన్నియు నుండ శ్రీ హరికటాక్షంబున
ననుకూలమౌ మన కన్ని వగుప

గీ. వలదనుచు చిత్రవర్ణాసనములు బరచి
అతిరథుల మంత్రి మాగధులవని సురల
ఆటపాటక వాద్యమహారవముల
తోడ మీరేగి వారల తోడి తెండు.

వ. అని వారలం దోడ్కొనిరమ్మని కొందరం బంపి అప్పుడు బుద్ధిమతిమంత్రి.

అటతాళము.

తనసుతుని నతి త్వరగ-బిలచియు
కనకమణి భూ-షణములు
అనువుగానిడి-హాటకాంబర
మమర గట్టి. ౧

శిరమునను వర-మణి కిరీటము
మెరవడిగను-బెట్టియు

పరిమళాదులు-నలది అరవిరి
సరులు దురిమీా. ౨

మందహాసము-తోడ నందను
నందముగనూ-నవ మణి
కుందనపు టా-సనముపై నిం
పొంద నునిచీ. ౩

వంది మాగధ-బృందవర్గము
సందడింపా-కటికులు
అందముగ-బిరుదావళులు ఇం
పొంది చదువా. ౪

వీరణములు న-గారలును సం
వీరములునూ-భేరులు
బూరగొమ్ములు-నాగ సరములు
బోరు కలరగ. ౫

వ ఆసమయంబున రత్నాంగద మహారాజు బంపిన పండిత ప్రధాన మండలాధిపు లేతేర, అప్పుడు బుద్ధిమతిమంత్రి దుందుభి, పటహ, శంఖాది తూర్యంబులతో నెదురేగి తోడ్తెచ్చి, వారల నుచితాసనంబులం గూర్చుండ నియమించి-

జంపె.

తాంబూలములు పుష్ప, దామములు గంధములు
జంబీరములు జీని, చక్కెరలు పండ్లుగ. ౧

హెచ్చు వెల పరములును, ముచ్చటలరగ దెచ్చి
ఇచ్చి వారల జూచి, మచ్చికతో ననియెఁ. ౨
పరిణామమే మీకు, పతికి ప్రజలకు నిటకు
వరుని జూడగ మహీ, వరుడు మిము బంపెఁ. 3
రాకగద మీరిపుడు, రా కుమారుని జూడు
డీ కళా పూర్ణుండు, యితడు ధన్యుండూ. ౪
వేద శాస్త్రి పురాణ, వేదాంగ సంహితలు
శోధకుడు ధనుర్వేద, శూరుండు యితడూ. ౫

గీ. అనిన విని వారు వరుని జూ చి చంగజుడని
చూచి మోదించి యిటువంటి సుంద రాంగు
నెల్లెడల గాన మని వారి యుల్లమునను
సంతసం బంది వారలు సమ్మతించీ.

వ. అట్టిసమయమున తమలోతాము.

ద్విపద.

సకల కళా పూర్ణ, సర్వజ్ఞ మూర్తి
అకలంక గుణవంతు-డైన యీ వరుని
కన్నుల పండువై, కర మొప్పు వాని
సన్నుత మూర్తిని, చక్కగా జూచి
ఈ చంద మీయంద, మీ మంద హాస
మీ చతురోక్తియు, ఈ జాణతయును
ఈ పాటి సుకుమారు, నిలలోన మనము
భూపాల పుత్రుల, పొడగాన మెందు

నలకూబరుని నిశా, నాథు వసంతు
డలరు విల్తుని జయం, తాది వీరలను
చక్కని వారంచు,సరసు లెన్నుదురు
ఇక్కుమారునకు వా, రీడసరాదు
వనితకు తగినట్టి, వరుడు గావునను
అనుమానమును లేక, నతివ నీ వచ్చు
ననెడి వారల జూచి, యా బుద్ధి మంత్రి
కను గొని సంతోష కలితుడై బలికె.

వ. అప్పుడువారల మది నెరింగి దూరాలోచన జేసి, బుద్ధి మతిమంత్రి.

జంపె.

వినరయ్య మంత్రికో, విదులార యీరాజు
పనుప డెచటికి సుతుని, పర దేశ ములకూ. ౧
పట్ట పాయుధమునకు, బాసికము కంకణము
గట్టిపంపియు మచ్చు, కంటులను గొనుటల్. ౨
ఇట్టి నడతలు వీరి, యిలువరుస బాసికము
గట్టు కొని వత్తు మటు, పట్ట పాయుధముక్. ౩
భూమీశు నకునిదియు, బోదరవు లాయనా
ఆ మేర లెరిగింపు, డనిన వారనిరీ ౪
వినవయ్య మంత్రి మా, విభునకీ మాటలను
వినునటుల జెప్పి యే, విధమైన మేమూ. ౫

•ఆమానినీమణిని, అనుకూల పరచెదము
శ్రీమంతుడైన యీ, చిన్ని పాపనికి. ౬
అనిన వారలకు కన, కాంబరాభరణములు
మన మలరగా బుద్ధి, మతిమంత్రి యొసగెన్. ౭

వ. ఇట్లు బుద్ధిమతిమంత్రి వారలకుం దగిన సత్కారంబులు జేసి పంపించిన వారునుం దమకు రాజధానియైన మాణిక్య పురంబునకుం జని తమ స్వామియైన రత్నాంగదమహా రాజునుం జూచి.

త్రిపుట.

కనక పురమున - కలిగి ధర్మాం
గదుని సూనుని - కనుల జూచితి
మనఘు నాతని - మహిమ జెప్పను
మా వశంబా. ౧

తెల్ల ఏనుగ - రౌతు డీడన
బల్లిదుల తప - మెల్ల జెరిచెడి
కల్లరి డది - గాక దేహం
బెల్ల యోనుల్. ౨

అంగజుండీ - డనిన విరహుల
భంగ పరచెడి - దొంగ శివు క
న్నింగలంబున - నంగ మెల్లను
భంగ మయ్యెన్.

ఉడుప తతనికి - యీడనిన గురు
పడతి బొందిన - పతితు డదిగా
కుడుగకను క్షయ - రోగ పీడితు
డతడు జడుడూ. ౮

మూడ నతనికి - పుడమి నెడుగడ
లీడు గానము - వేడు కలరెడి
పోడిమియు నడ - వడుల నన్నిట
ప్రౌఢు డతడూ. ౯

వ. అని రత్నాంగదునింగని వారలుమఱియు,

సీ. వినవయ్య ధర్మాంగ | దోర్వీశ చంద్రుండు
తనపుత్రు నితర రా | ష్ట్రింబులకును
పనుప డెన్నడు సుతుని | పట్టపు కత్తికి
బాసికంబును గట్టి | పంపి పుణ్య
వతులు మాంగల్యంబు | వనితకు ధరియింతు
రిట్టి నడతలు వారి | యింటి వరుస
లనియు నా వరునకీ | లలన నివ్వగ వచ్చు
నిందు కనుమాన | మింత్రైన వలద

టనియు జోస్యుల బిలచి | కల్యాణమునకు
నిశ్చయ పరచి లగ్నంబు | నిల సుగులను
బంపి యారాజ వరుని | రప్పింపు మనియు
విన్నవించిరి వారలు | విశదముగనూ.

వ. ఇట్లు బలికిన విని రత్నాంగదుండు.

ద్విపద.

అనిన రత్నాంగదుం - డతి చోద్య మంది
తన మది నొక్కింత - తలపోసి జూచి
అనఘులౌ విప్రుల-నపుడు రప్పించి
వినుడని వారిక-వ్విధమెల్ల జెప్పి
కాంతుడు లేక నే-కరవాలమునకు
ఇంతికి పరిణయం-బెట్లు జేయింతు
బోటికి రారాని-బూమెలు వచ్చె
సాటి వారల లోన-మాటల కెడము
మేదినిలో యిట్టి-మేరలు గలవె
భూదేవులా రనిన-భూపతి కనిరి
వినుము రత్నాంగదో-ర్వీపాల చంద్ర
మనసున నీవిట్లు-మరుగంగ నేల
అవని ప్రాజాపత్య-మసుర పిశాచ
దైవ మాగదముగాం-ధర్వ బ్రాహ్మ్యంబు
రాక్షసం బనువివా-హము లెనిమిదియు
ఈ క్షితి గలదు గా-కిది ప్రజాపత్య
మనెడి వైవాహిక-మార్గ మూహింప
జనపతులకు చేయ-జెల్లు గావునను
అనుమాన మేటికి-ఆత్మలో నీకు
అనిన సంతస మంది-యారాజ విభుడు
ఘనుల విప్రుల జూచి-కన్యకా మణికి
పరిణయం బొనరింప-పరమ లగ్నంబు

సరి జూచి జెప్పుడన-శాస్త్రోక్తు లరసి
చంద్ర తారాదులు-చక్కగా నుండ
కేంద్ర మందున శుక్ర-గురు బుధు లుండ
పంచాంగ దోషంబు-పాటిల్ల కుండ
పంచక రహితమౌ-పరమ లగ్నంబు
సప్తమ శుద్ధిగా-చైత్రమాసమున
యుక్తమౌ పంచమి-యొగి గురువార
సలలిత శుభయోగ-సాధన తార
లాలిత మగు కుంభ-లగ్నంబు లెస్స
యని నిశ్చయించి యా-యవనీశు జూచి
వినుమని విప్రులు-వేడ్కతో జెప్ప
పరమాతి శయమొంది-పసదనం బొసగి
ధరణీసురుల బంపి-ధరణీశు డంత.

వ. ఇట్లు రత్నాంగదుండు కన్యకామణియైన త్రైలోక్యసుంద రికి కల్యాణ ముహూర్తంబు నిశ్చయించి.

సీ. కనకపత్రిక దెచ్చి ॥ గ్రక్కున లిఖియించె
శోభనం బీ చైత్ర ॥ శుద్ధమందు
పంచమి గురువార ॥ పవన తారను కుంభ
లగ్న మన్నిటజూడ ॥ నదియు లెస్స
ఏకవింశతి దోష ॥ మేమియు జెందవు
యీముహూర్తమున ॥ మీ రిచ్చటికిని
జాగుసేయకవచ్చు ॥ జోకతో రండని
పత్రికపై వ్రాసి ॥ బ్రాహ్మణులను

జీరి శుభ రేఖ వారల ॥ చేతి కిచ్చి
కనకపురమున కీప్రొద్దె ॥ కదలి ధరణి
పతిని గని మీరు పరిణయ ॥ పత్రికొసగి
వేగ రండన, వరిగిరి ॥ వేడుకలర.

వ. ఇట్లు రత్నాంగదుండు ధర్మాంగదునకు పరిణయపత్రిక లిఖియించి కనకపురంబునకుం బంచి తనమంత్రినింజూచి, పట్టణంబు కై జేయించమని నియమించిన, నతండు పౌరులకుం జెప్పి పట్టణంబు శృంగారింపం జేసిరటా యెటువలెనూ.

అటతాళం.

పురముననుగల-పౌరు లందరు
పొందుగానూ-నెలవుల
కరము సంతస-మందగా కై
జేసి రపుడూ. ౧

కమ్మ జవ్వా-దియును అత్తరు
కలయజేసీ-వీథుల
గమ్మనుచు వా-సించగా
కలయాపి జల్లీ. ౨

పచ్చికస్తురి-మృగ మదము
పన్నీరు గూర్చి-నలికియు
ముచ్చటలరగ-కొత్త ముత్యపు
ముగు

కుంకు మగరుల-పంకముల గో
డలును బూసీ-వ్రాసిరి
పొంకముగ చి-త్రములు జూడ న
లంకరింపా. ౪

భవనముల నిడి-రవిరళముగను
పసిఁడి బుగడల్-పడగలు
నవమణుల తో-రణము వీథుల
నలర గట్టి. ౫

పసిఁడి బుగడల-పట్టు సూర్య ప
థములు బిరుదుల్-టెక్కెము
లెసగ పట్టు వి-తానములు కెం
పెసగ గట్టి. ౬

కనకసభ లిం-టింట వాకిట
కనక కదలుల్-నిలిపియు
కనకమణి కం-భముల పూరణ
కలశ ములునూ. ౭

కలవడంబులు-పట్టు కుచ్చులు
గట్టి విరులా-సరములు
చలువ చప్రము-నిలువుటద్దము
లలర బెట్టి. ౮

మేడ లుప్పరి-గెలును వాడలు
గోపురములూ-నప్పురి

వేడుకలరగ-జేసి రప్పుడు
పోడి మలరా.

వ. ఇట్లు పట్టణంబు శృంగారం బొనర్చినం జూచి సంతోషాంత రంగుండై రత్నాంగదుండు.

గీ. పరిణయపు పత్రికలు వ్రాసి భటుల బంపి
భూధవుల బంధు విప్రుల బుధుల నెల్ల
వేగ రప్పించి వారల విడుదులందు
నునిచి శోభనద్రవ్యాదు లొగి నమర్చి.

వ. ఆసమయంబున విప్రపుంగవులు కనకాపురాధీశ్వరుండైన ధర్మాంగద మహారాజునుం గని శోభన లేఖ లిచ్చినంజూచి వారలకు వస్త్రాభరణంబు లొసంగి పంపించి ధర్మాంగదుం డు బుద్ధిమతి మంత్రినింజూచి.

ద్విపద.

రత్నాంగదుం డతి-రయమున పరిణ
యత్నంబు గావించి-యచటికి నన్ను
సమ్మదంబున పరి-జన సహితముగ
రమ్మని శుభలేఖ-లంపించినాడు
ఎవ్విధిబోదు యీ-రవ్వ కేమందు
పువ్వుబోణిని నెట్టు-బోగికి దెత్తు
పురువుగని వారులను-పుత్రు డని జూపి
పరుల బిడ్డల దెచ్చె-పాపి కట్టిడి
దుష్టచిత్తుడు ఖలుడు-ద్రోహి వంచకుడు

కష్ట చిత్తుడు మోస-గాడని యిట్టి
తిట్టున కోడి గట్టి-రట్టు బొందు మని
పుట్టించెనే నన్ను-కట్టడి బ్రహ్మ
శ్రీమంతుడైన యా-శ్రేష్టీశు పురికి
ఏమోము తచటికి-యేనెట్టు బోదు
తలచెగా దైవంబు-ధరణీశు సభల
తలవంపు జేయించె-ధరయెల్ల దిట్ట
నగుబాటు జేసెదవ-నలుగురిలో నన్ను
జగమెరుంగగ నీవు-జేసితి విట్టి
పనులు వద్దని నేను-పలుమారు జెప్ప
వినవైతి విది నాదు-విధివశం బరయ
ఏమిగానున్నదో-యేమి జేయుదును
భూమీశు పురికి నే-పోజాల నీవు
చను మిపుడు పరివార-జనసహితముగ
అనియు ధర్మాంగదుం-డవనీశులకును
బంధువులకు నెల్ల-పత్రిక లనిపి
పొందుగా రప్పించి-భూసుర వరుల
అతిరథులను మహా-రథుల దిగ్గాధి
పతు లర్ధ రథులను-పట్టభద్రులను
సమ రథులను మంత్రి-సామంత బుధుల
క్రమమున వంది మా-గధ కవీశ్వరుల
భటుల పురోహిత-పండితార్యులను
కటికుల గాయక-గణికుల నటుల

చతురంగ బలముల-సకల పరిజనుల
జతనంబు జేయించి-జనపతి యప్పుడు
భాసురంబుగ పట్ట-పాయుధంబునకు
బాసికంబును గట్టి-పల్లకి నుంచి
దుందుభి పటహాది-తూర్యము ల్మ్రోలగ
వందిమాగధ కవి-వర్గంబు బొగడ
పంపించె మంత్రిని-పతి జేసి పెండ్లి
కింపొంద సౌరాష్ట్ర-యిలపతి పురికీ.

వ. ఇట్లు ధర్మాంగదుండు మాణిక్యపురమునకు సకల పరిజనం బులతో బుద్ధిమతి మంత్రినిం బంపించ, వారునుం జను నప్పుడూ.

క. శ్రీనాథుని తురగంబును
మానుగ మాంసంబు కాల మర్చుక కుడినుం
డానాథా యని యెడమకు
భూనాథుని దలచుకొనుచు బోరున నరిగెన్.

వ. ఇట్టి శుభశకునంబులు జూచుకొని జనునప్పుడూ.

జంపె.

కొంద రరదము లెక్కి-కొంద రేనుగ లెక్కి
కొంద రశ్వంబులను-పొందుగా నెక్కి. ౧
కొంద రెక్కిరి శకటు-లందముగ కొందరును
అందలము లెక్కి రతి-సుందరంబుగనూ. ౨

కొందరును కాల్నడల-ముందుగా నరిగిరతి
మందహాసముతోడ-మాణిక్య పురికి. 3

వ. ఈప్రకారంబునం జని మాణిక్యపట్టణప్రాంత్యంబున నిలచి, తమరాక రత్నాంగదున కెఱింగించిన, నతండు తనమంత్రి నింజూచి.

అటతాళము.

బందులతో విప్రులతో-పండిత
పరి జనులతో-నీవిపు
డందముగ జని-వార లిచటికి
పొందుగానూ. ౧

తోడి తెచ్చియు-తగిన విడుదుల
వేడు కలరా-నునిచియు
పోడి మలరగ-రమ్ము వేగమె
పొమ్మ టనినక. ౨

బంధువుల సచి-వా ప్త పౌరుల
పండితులతో-పల్లకీ
గంద గజ తురగ-గముల రధముల
బృందములతో 3

దుందుభి ప్రణ-వాది తమ్మట
తూర్యములతో చెలగగ
సింధు రోదయన-భటులు కటికులు
సంద డింపా. ౪

సుందరులు విం-జామరులు సుర
టీలు వీవా-గణికలు
పొందుగా నృ-త్యములు సలుపవ
సుంధర వరుల్. ౫

జేసి రాశీ-ర్వాదముల ఘో
షములు వెలయా-కవులును
భాసురంబుగ-బొగడ పరిజన
పణతి గొలువగ. ౬

జనియు మంత్రిని-గనియు కట్టము
లొనర నిచ్చి-వారల
మన మలర తో-త్తేర గని పురి
మగువ లపుడూ. ౭

వ. ఇట్లు రత్నాంగదుని మంత్రి ధర్మాంగదుని మంత్రియైన బుద్ధిమతి మంత్రినిం గని కట్నంబు లొసంగి పరమాతిశ యంబునం దోడ్కొని వచ్చునప్పుడు నప్పట్టణంబునం గల కాంతాజనంబులు ఒక్కరితో నొక్కరు.

సీ॥ అమ్మక్క లారొక్క ♦ అద్భుతం బైనట్టి
వింతలు బుట్టెగదె ♦ వినరె యమ్మ
కత్తికి బాసికం ♦ బెత్తి గట్టుక వచ్చి
కల్యాణ మొనరింప ♦ గలద టమ్మ
పతి లేక సతికిని ♦ పరిణయం బేలాగు
జేతురో యిది యేమి ♦ చిత్ర మమ్మ

తల్లిబ్రాలు సతికెవరు ॥ తలనిడుదురో యమ్మ
కంఠమున మినుకెవరు ॥ గట్టుదురమ్మ

గీ॥ బంధు జనులలో చెలికిదొక ॥ నిందయనుచు
వదరు కొందరు వారిలు ॥ వరిశె లమ్మ
జనపతుల కిట్టి పెండ్లిండ్లు ॥ జెల్లునమ్మ
ఆగమోక్తప్రకారమి ॥ దమ్మ యిట్లూ.

వ. అని కాంతా జనంబులు నానావిధంబులం బలుకు చుండగ వారలందోడ్కొనివచ్చి విడుదులం దుంచి బహువిధ అన్న పానాదు లమరింపం జేయించి మంత్రి రత్నాంగ దున కెరింగించిన నతండు.

తడ వేటి కిక యనుచు – పుడమి సురులను బిలచి
గడియ గుడకయు జూచి – నొడుడు లగ్నమనఁ॥ ౧
వినియు పంచాంగంబు – గనియు జనపతి కనిరి
యెనసి యున్నది నేఁడు – దినశుద్ధి యనిరఁ – ౨
ముత్తైదువుల నపుడు – మొత్తముగ రప్పించి
పుత్తడాభరణములు – పుట్టములు రవికెల్ 3
మెచ్చు లొదవగ వారి – కిచ్చి యిటు తోడ్తెండు
మచ్చకంటిని పుత్రి – ముచ్చటలరగనూ ౪
అని నంతిపురమునకు – జని కన్యకా మణిని
గని వారి మన మలర – గైజేసి రపుడూ ౫

వ. అక్కన్యకా మణియైన త్రైలోక్యసుందరికి ముత్తైదువలు శృంగారింపం జేసిరటా యెటువలెనూ.

త్రిపుట.

తురుము వీడగ - పేరులును కుచ
గిరులు నొరయగ - కంకణంబులు
మొరయ సంపఁగి - నూనె శిరసున ౧
ముగుద లంటీ.

తేట పన్నీ - రాట కాఁగుల
వాటముగ తొర - లించి యావిరి
బోటికిని జలకం - బొనర్చిరి
పువ్వు బోణుల్ ౨

నెరి కురులు తడు-లొత్తి సరిగం
చరటి విరులెర-బట్టు గట్టియు
కురులు నున్నగ- దువ్వి తురుమిడి
విరులు దురిమీ. ౩

పసుపు బూసియు - నొసల తిలకము
లెసగ దిద్దియు - బిసరుహాక్షుల
పసగ కప్పిడి - నాసి ముక్కర
లెసగ బెట్టీ. ౪

రవలు గులికెడి - రవికె దొడిగియు
నవమణులహా - రములు మెడ నిడి

బవిరెలును బుగ - డలును బావిలి
ముసుగు గమ్మల్. ౫

సంది దండలు - సరులు నీవీ
బంధ మిడి కర - కంకణంబులు
కుందనపు టం - డెలును పదసరు
లంద మునగనూ. ౬

కనకమణి ఖచి - తముల ముద్రిక
లనువుగా పది - వ్రేళ్ల నిడి శసి
ఇనుల పాపట - బొట్టు తలమా
నికము లిడిరీ. ౭

తలిరు బోణులు - పరిమళాదులు
నలది వేడుక - లలర జేసియు
వెలది నప్పుడు - తోడి తెచ్చిరి
వేదికకునూ. ౮

నునిచి కనకపు - పీటికను శో
భనము బాడియు - నలుగు లిడి రవు
డనఘు లార్యులు - మంగళాష్టక
మొనర జదువగ ౯

గీ. సకల వాద్యరవంబులు ॥ సందడింప
భూ ధవుల బంధు జనుల పు ॥ రోహితులను
వేగ రప్పించి వారికి ॥ విడెము లిచ్చి
గడె గుడికలోన లగ్నంబు ॥ కదియ జూచి.

ద్విపద.

అపుడు రత్నాంగదుం-డమ్మంత్రి వరుని
ఇపుడె వేగంబున-నిటు రమ్మ టనియు
భటుల బంప నతండు-పరివారములతో
తటుకున నేతేర-ధరప తెదురేగి

ఎదురు శాసలు జల్లి - ఎలమి తోడ్తెచ్చి
సదరున నిడి పుణ్య-సతుల రప్పించి
అరుగు పన్నీరున-అలికి వోరుంచి
మురు వొప్ప ముత్యాల-ముగ్గు దీర్పించి

ప్రియ మొప్ప బంగారు-పీట బెట్టించి
రయమున ఖడ్గంబు-రంగుగం దుంచి
సుతయైన త్రైలోక్య-సుందరం దుంచి
సతుల ముత్తైదుల-సరస నందుంచి

గణ్యులౌ విప్రుల-కరుణ రప్పించి
పుణ్యాహవాచనం-బొనర జేయించి
పంకజాక్షికి పట్టు-పాయుధంబునకు
కంకణంబులు బాసి-కంబు గట్టించి

వేదసూక్తుల యజ్ఞ-విదు లొనరించి
వేదోక్త దానము-ల్వేడ్క జేయించి
పుణ్య సూత్రమునకు-పూజ గావించి
పుణ్య వతు లంగనకు-పుణ్య సూత్రంబు

ధరియించి రరుతను-తలబ్రాలు బోసి
కరవాలమునకు నా-క్రమమునం బోసి
రావేళ భూసురు-లాశీర్వదింప
వే విధంబుల బుధు-ల్వేడ్క దీవింప

వంది మాగధ కవి-వర్గంబు బొగడ
సందడిగా కటిక-జనులు కీర్తింప
గాయకు ల్వీణాది-గానముల్ మొరయ
పాయక సంగీత-పాటకుల్ చెలగ

వారకాంతలు భరత-వరుస నటింప
చేరి ముత్తైదువ-ల్సేసలు జల్ల
తొడరి ముప్పది రెండు-తూర్యము ల్మ్రోయ
కడు వేడుకతో నిట్లు-కన్యకామణికి

నాలుగో దినమున-నాగ వల్లియును
వాలాయముగ జేసి-వరనందనకును
పరిణయం బొనరించి-పార్థివేంద్రులకు
కరము సంతసమంద-కట్నంబు లిచ్చి

సకల జనాలికి-సత్కార మొసగి
ప్రకటిత గతిబంపి-పార్థివేశ్వరుడు
సచివుని పూజించి-సకల కట్నములు
ఉచితోక్తముగ నిచ్చె-నొనర కూతునకు

పదినూరు తురగముల్-పదినూరు కరులు
పదినూరు అరదము-ల్పదినూరు పశులు

ధన కనక వస్తువు-ల్దాసీజనములు
కనకాభరణములు-కనక వస్త్రములు

తనయ కరణంబుగా-తనివార నిచ్చి
ఘనమైన బుద్ధులు-గఱపె భూవిభుడు,

వ. ఇట్లు రత్నాంగదుండు పుత్రియైన త్రైలోక్యసుందరికి పరిణయంబుజేసి అరణంబులొసంగి తనయనెత్తి ముద్దాడి బుద్ధులు గఱపెనటూ యెటువలెనూ.

జంపె.

అత్త మామల మాట-కడ్డమాడకు వారి
చిత్తమలరగ సేవ-జేయుమో యమ్మా. ౧
బావ కెదురుగ నిలిచి-బలుకకుము నగబోకు
వావివరుసలు గలిగి-వర్తింప వమ్మా. ౨
ఆఁడబిడలతో కలహ-మాడకుము వారలతో
జోడుబాయక మైత్రి-గూడుండ వమ్మా. 3
పతియె దైవము సతికి-గతివేరె లేదెతుక
పతిని శ్రీపతియుగా-భావించ వమ్మా. ౪
పతిమాట కెదురుబడి-బలుకకుము కలనైన
పతివ్రతా ధర్మంబు-పాలించు మమ్మా. ౫

మది మాపు రేపు పతి-పదములను భయభక్తి
వదలకను గొలచి యొక-వన్నె దేవమ్మ. ౬

నడవడిలో యీడు పడ-తులలోన పుడమి నెడు
గడల లేదని పేరు- బడయుమో యమ్మా. ౭

పుట్టినింటికి మెట్టి-నింటికిని దిట్టయై
గుట్టుతో మెలగు మొక- రట్టు దేకమ్మా! ౮

గురు బుధులు ధరజనులు- ధరణీ వరుడు ధవుడు
సరిమెచ్చ నడువుమొక-సడి దేకు మమ్మా. ౯

వ. అని రత్నాంగదుండు త్రైలోక్యసుందరికి బుద్ధిజెప్పుచున్నంత తల్లియైన శుచిరాంగి తనయనుం గని కౌగిటం జేర్చి తన కరంబుల వికసితార వదనంబునం గూర్చి ముద్దులిడి ఆనంద బాష్ప పూరిత నయనయై పులకజాలంబు లెగయ.

సీ. ఆఁడబిడ్డగ బుట్టు ƒ టధమ మెవ్వరికైన
ఒకరింట బుట్టొక ƒ రింట మనుట
అత్త మామల నాఁడ ƒ బిడల కేరాండ్లకు
బావ మరుదులకు బం ƒ ధులకు పతికి
సరిమెచ్చ నడిచియు ƒ సత్కీర్తి దేవమ్మ
జననీ జనకులకు ƒ సంతసమున
పతియె దైవమటంచు ƒ మది నెంచి వర్తించు
మంచోడి బాలుంచి ƒ పంచె నపుడు

గీ. పసిఁడి పల్లకి సుతనుంచి । వసుమతీశు
డూడిగపు చేడియల జీరి । తోడు గూర్చి
బాపె బుద్ధిమతీమంత్రి । పరి జనులతో
కదలె నావేళ సంతోష । కలితు డగుచూ.

వ. ఇట్లు పరిణయంబొనరించి త్రైలోక్యసుందరినిం దోడ్కొని బుద్ధిమతిమంత్రి సకలపరివారంబులతో కనకాపురి ప్రాంతంబునకు వచ్చి తనరాక ధర్మాంగదున కెఱింగింపంబంచిన అప్పుడు ధర్మాంగదుండు,

త్రి పు ట.

పంచవిధ వా-ద్యములు చెలగగ
పౌరులతో పరి-జనుల బుధులతో
అంచితంబుగ-యెదురుగా జని
అవని విభుడూ. ౧

వేడుకలరగ-మంచి వేళను
తోడుకొని తన-నగరి కరిగెను
కోడలంతః-పురమునకు జని
పోడి మలరా. ౨

అత్తగారి ప-దంబులకు అతి
భక్తితో మ్రొ-క్కనను కోడలి
నెత్తి కౌఁగిట జేర్చి దీవెన
లిచ్చె నపుడూ. 3

ముప్పు ముత్తై-దువయి కొడుకుల
మొత్తముగ గని-చిత్త మలరగ
వొప్పుగా పతి-భక్తి గలి గభి
వృద్ధి బొందూ. ౪

మనిమనిచె తన-యింట గుణవతి
ననువుగా త్రై-లోక్య సుందరి
పను లొనర్చెను-అత్త మామల
మనము లలరగ. ౫

వ. ఈ ప్రకారంబున అత్త మామల చిత్తంబు లుప్పతిల్ల పను లొప్ప మెప్పుగా జేయు ఉత్తమాంగనయైన త్రైలోక్య సుందరినింజూచి యగ్గుణవతి హంసతూలిక ఆడుచుందం బున మనోవేదనంగ్రాగి మిట్టిపడి.

జం పే.

ఇట్టి యుత్తమ సతికి-యెట్టు యీ పాపమొడి
గట్టనుభవించు మని-పుట్టించె బ్రహ్మ. ౧
నారీమణిని గట్టి-బారిగా పాముకని
ఈరేడు లోకముల-కారు దూరాయెగ. ౨
ఆపదల కొకదైవ-మడ్డబడు యెటువంటి
పాపికైనను అనెడి-పలుకు లేదాయెగ. ౩
పామునకు బారియై-బరగ తొలుతేమి కొర
నోము నోచెనొగాన-యీ కోమలాంగీ. ౪
అయ్యోయీ యగుడుకే-య్యెడదూరు దిలనోళ్లు

ముయ్యి ఘూకుడు గలదె-యెయ్యెడల నైనఁ. ౫
పెనిమిటియు హీనమై-వనట బొందుమటంచు
వనిత కెవ్వరు నిడిరొ-కనలి శాపంబూ. ౬
ఇప్పుణ్యవతినహ-ర్నిశములను కంటికిని
రెప్పవలె గావ విధి-నిప్పులాడి గట్టెఁ. ౭

వ. అని గుణవతి తనమనంబున నానావిధంబులం దలంచి శోకింపుచున్నంత కొన్నిదినంబులుంజనిన త్రైలోక్యసుందరి యౌవనంబైన తనమనంబున పురుషునియందు వాంఛబొడమి పెనిమిటిని రాకలం బోకలం కనవిన నగబడ నేరకున్నంత అద్భుతానంద శోకాయత చితంబున నన్వేషింపందొడంగె నప్పుడు.

జంపె.

మిద్దెలును మేడలును-గద్దెలును గృహములును
ముద్దియ వెదకదొణఁగె-సద్దు సేయకనూ. ౧
అంతఃపురములు న-న్వేషించి కాన కతి
చింత నొందియు సతియు-మంతనంబుననూ. ౨
ఎక్కడికి చనెనొ నతి-డొక్కనాఁడైన కను
లెక్కబడ డిదియెట్టి-తక్కువల కెడమో. 3
ఇదియేమి మాయమో-యుతర దేశాధిపతి
సదనముల కేగ నిలు-సరణి లేదటనే. ౪
సచివుడేమొ మదెంచి-మసిబూసెగా కత్తి
పసగ గొనివచ్చి నను-పరిణయ మొనర్చీ. ౫

ఇటునన్ను దెచ్చుటొక-కౌతుకము గానున్న
దిదియేమొ తెలియరా-దేమి సేయుదునూ, ౬

బిడ్డ బరువని మాట-కడ్డమాడక తండ్రి
పట్టి కత్తికి నన్ను-గట్టి యిటుబంపెఁ. ౭

వ. అని మఱియు,

ద్విపద.

మగని పొందిక లేని-మగువ నెంచగను
జగతి తొండము లేని-సామజం బిరవి
లేని దివమును శశి-లేని నిశి తావి
లేని సుమము తంతి-లేని మహతి సుతి
లేని పాట పికంబు-లేనివన సుఖము
లేని పంజరము పతి-లేని ధర బండి
లేని తేరును వృష్టి-లేని సస్యంబు
గాన పతి లేని సతి-కారాదు భువిని
పతియె దైవము గురు-పతిచుట్ట మట్టి
పతిలేని వెనుక సతి-ప్రాణ మేమిటికి
అని తన మదిలోన-అతి చింత నొంది
వనజాక్షి వ్రాడిగ-వనితల కనియె.
కన్నియలార నా-కాంతు డేడమ్మ
కన్ను లొకనాడైన-కనుబడడె యమ్మ

రాక పోకలనైన-రమణునొకనాడు
జోకతో కలనైన-చొప్పడెయమ్మ
జాడల వాడల-సన్నల నైన
చూడ దొరక డిదేమి-చోద్యమే యమ్మ
పలుక నవ్వగ చెలగ-పాడగా నాడ
చెలువు నొక నాడైన-జూడనే యమ్మ
పడతికి పతిలేని-ప్రాయ మెవ్వనము
అడవి గాచిన వెన్న-లాగదే యమ్మ
దరిలేని విరహాగ్ని-తమకమున మగని
మరచి యుండెదనన్న-మరపు రాదమ్మ
నట్టేటిలో మునుగు-బుట్టి రీతిగను
ఎట్టు వేగింతునే-కట్టడులార
పరభూములకు తండ్రి-బంపి యున్నాడొ
ధరణీశు వద్దనే-తరల కున్నాడొ
ననునొల్ల కతని మది-నలుక నున్నాడొ
తెలియరా దిదియేమి-తెరగని యడుగ
కలకంఠితో ననిరి-కన్నియ లపుడూ.

వ. ఇట్లు త్రైలోక్యసుందరి విరహానలంబున పరితాపంబునొంది వరుని జూపరని యడిగిన నత్తరుణీమణులు,

అటతాళం.

పొలతిరో విను-నీదు పురుషుడు
పుట్టుభోగి-ఆతడు

పలుక డెవరితో-మనసిపడిగె తల
గలుగువాడూ. ౧
జంట నాలికె-పంటవిషమం
టుండునడువఁ-డొంకులు
వంట యింటిలో-పెట్టెలోనుం
డొంటిగతడూ. ౨
ధవళ వర్ణుం-డమృతనిధి సుత
ధవుని శయ్యా-సఖుడగు
శివుని పూజకు-దగిన యోగ్యుడు
చెలియ యతడూ. ౩
జీరు నతడెవ-రైన సంగడ
జేర రితరుల్-భయమున
పారుదురు ఫణి-రాజో యని నా
రీలలామా. ౪
ఉత్తమాంగన-నీ పెనిమిటిని
చిత్త మలరా-జూపని
మెత్తదనమున-నడుగు నీవిపు
డత్త ననినఁ. ౫

వ. అనిన నయ్యుత్తమాంగన వారలతోను,

ఏకతాళం.

ఏమనడుగు దత్త-సెగ్గువిడిచి నే
నీమాటడిగిన-నా మేమనునో. ౧

అడిగిన వినిఅత్త-అదలించునో చిన్ని
పడుచవు నీకీ-పలుకే లనునో. ౨

కొట్టునొ తిట్టునొ-కోపము జేసునొ
రట్టడి బెట్టునొ-గుట్టు జెరుపునో. ౩

బీదకు దానము-సిరికికి యుద్ధము
వెదకిన తీపును-వేముకు గలదే. ౪

అత్తకు చిత్తము-మెప్పగు కోడలు
కత్తికి రాతికి-మెత్తన గలదే. ౫

భూమీశునకు మద-సామజమునకు నాగు
బాముకు చెలిమియు-భూమిని గలదే. ౬

అనియెటు లడుగుదు-నన వనితలునని
రనుమాన మేటికే- తనమగ నడుగక. ౭

విటుకులు బలికెదు-మటమాయ బన్నెదు
వెటువలె బ్రతుకుదు-వే వెఱ్ఱిదానా. ౮

నయ భయముల నె-న్ననిన జలాన్నము
ప్రియుని జూడక నే-భోంచేయననుమీ. ౯

వ. అని చెలులు ఈవిధంబున బుద్ధిజెప్పి పొమ్మని పంపించిన త్రైలోక్యసుందరి అత్తనుంగని మ్రొక్కి, పొత్తుననిలచి మెత్తని పలుకుల చిత్తంబు తత్తరబడుచు.

సీ. చెన్నుగా నను పెండ్లి జేసిన మొదలుగా
నేటివరకు గాన నీకొడుకును

ఎక్కడికైనాను ƒ యేగినాఁడో గాక
    నను గన తనకొల్ల ƒ కలఁగినాఁడొ
మ్రొక్కెదీ వలుగకు ƒ మగని జూఁడకగాని
    నీపాదమూన నే ƒ నీరు మెతుకు
ముట్టను పతిలేని ƒ ముగుదకేటి సుఖంబు
    అన్న వస్త్రము సొమ్ము ƒ లెన్న యేల

గీ. తల్లి దండ్రులు గురు లన్న ƒ దమ్ము లత్త
మామ బావ మరదులేల ƒ మగడు లేని
మగువ కేటికి ప్రాణంబు ƒ మాటలేటి
కిపుడు విభు జూపుకౌతుక ƒ మెరుగబలుకు.

వ. అనిపలికిన కోడలినింజూచి శోకానలంబున భగ్గలంబంది చింతాయత్తవృత్తిచే బశ్చాత్తాప సంయుక్తయై యూహించుచు యగ్గుణవతి.

జంపె.

అప్పొలతి మతిదెలసి-ఆశ్చర్యబడి గుట్టు
    జెప్పకుండిన మీద-చెలియ యేమౌనో. ౧
ఎన్ని దినములు దాఁచు-కున్ననొక నాటికిని
    పన్నుగా వివరించి-బలుక వలసినదే. ౨
కొడుకైన నీవె నా-కోడలైనా నీవె
    నొడువ నోరును లేదె-కొడుకు వీఁడనియుఙ. ౩
చెలియ నే నేమనుచు-బలుకుదును నా నోము
    ఫలము కడుపున పాము ƒ నలువ బుట్టించెఙ. ౪

కొడుకనుచు నిడికేరు - ప్రజ మెరుగ బడమంత్రి
జడియ కిటు మసిబూసి - పడతి నిను దెచ్చెన్. ౫
ముదిత నీ పాపమతం - డదయుడై గట్టుకొన
నిదె చూడు మని పాము - సుకతి కటు జూఁపెన్. ౬
కుండలిని జూచి మది - గుండె ఝల్లని వణఁకి
మెండు మూర్ఛల బడియు - నుండె నొక జాముగా. ౭

వ ఇట్లు చూపిన సర్పంబునుంగని త్రైలోక్యసుందరి భగ్గలం
బంది మూర్ఛిల్లి తెలివొంది పెక్కురీతుల విలపించుచు,

త్రి పు ట.

శిరము వదనము - నురము నోరును
కరములను మొ - త్తుకొని ధరబడి
పొరలి దైవము - విధిని దూరుచు
పొగిలి యేడ్చెగా. ౧

ఎందు దూరుదు - యీ విధికి నే
మందరాధర - నంద నంద ము
కుంద దశరథ - నంద గోవిం
దిందిరేశా ౨

అయ్యయో యీ - పాపమున కె
య్యెడ దుముకు దే - నంచు కుయ్యిడు
దయ్యొ నాకొక - దిక్కు లేదె
య్యెడకు బోదూ.

మగువనై జని - యించి ఖగమున
కగబడియు వగ - లగుడు బడుమని
జగమెఱుగ లిఖి - యించె నా తల
పగ గొని విధీ. ౧

దవుడులే కధిక - వ్యసనముననను
దవిలి సలసియు - నవసి యీవిధి
అవిధి బడుమని - భువిని మును నను
యెవరు డిటిరో. ౨

వ. అని మఱియు,

ద్విపద.

రామరామా నేను - భామనై బుట్టి
భూమెల పాలైతి - పోలించి చూడ
బూచిని గనియింట - దాఁచి బెట్టుకొని
నేచి కొడుకని పేరు - నేల నిండించి
పర భూములకు సుతుని - బనుప మాయింటి
వరుస లేదని కర - వాల మంపించి
పరిణయం బొనరించి - వరుస నఁ దెచ్చి
దురితంబ టనకిది - ద్రోహంబటనక
తరుణి గదాయని - కరుణ మతిలేక
వరుడిత డని పురగ - వరు జూపువారు
ఈరేడు లోకముల - నారీ జనముల
నీరీతి జేయువా - రెందైన గలరె

బిడ్డల గన్నవా - రిట్లు జేయుదురే
గొడ్డువు గాబట్టి - కట్టడై నన్ను
రట్టుల బొందించ - రాక్షసిం బెట్టి
గుట్టును బోగొట్ట - గోడు బెట్టించ
వంచన లెంచినగ - గొంచె పరపించ
ఎంచి జేసితిరి మీ - కేమి జేసితిని
నిను నన నేల న - న్నిట్టు జేసినట్టి
చెనటియా మంత్రిని - జెప్పవలె గాని
ధరపతి సుతు డని - తనసుతుని జూపి
పరుల బిడ్డల దెచ్చి - భంగ పరపించ
ఎట్టు దలచెనో మది - చట్టు జేసుకొని
పుట్టలేకో ఆడ - బుట్టుల తతకు
కటకటా యిటుచేయ - కరుణింత లేక
తటుకున తన కేమి - తప్పు జేసితినో
ము న్నెవరి మగువల - మొగల బాపితినో
పన్నుగా నాకది - ఫలియించె నిపుడు
నాసరి వారెల్ల - ఆశ లుప్పొంగ
భాసురంబుగ మగని - డాసి బ్రతుకంగ
కొర నోము నోచిన - దరి బేసి కిపుడు
వరు గూడి బ్రతుకంగ - ధర నెట్లు గలుగు
నను గని పెంచిన - జననీ జనకులు
కని వరున కీక నగ - కని వినని చోటి

కిచ్చి తనంతటి- యిలపతని యిట్టి
కుచ్చితుండని దెలిసి - తిచ్చునే నన్ను
ధర్మాంగదుడు మహా - ధర్మాత్ము డనెడి
ధర్మంబు విడిచి యి - ధర్మమొడి గట్టు
టెరుగడే మాతండ్రి - యిట్టి వంచనలు
ఎరిగి చెలులార మీ - రెట్లు దాఁచితిరె
ఇందరు గూడి యీ - దండశోకముకు
పొందించి దుఃఖంబు - లొంద జేసితిరె
మీరేమి జేతురు - వారిజ భవుడు
ఈరీతి నా నొసట - యిష్టమై వ్రాసె
నే నెట్లు బ్రతుకుదు - నిఖిలంబు లోన
పూని యెవ్వరు నన్ను - పోషింప గలరు.
పతి యని యెవరితో - భాషింప నేర్తు
పతి యని యెవరితో - బలుకుదు నగుదు.
పతి యని యెవరితో - రతికేళి జేతు
పతి లేని ప్రాయంబు - సతికి యేమిటికి
పతి లేని బంధువు - ల్బలగ మేమిటికి
పతి లేని సతికి కుత - లమునందు గలుగు.
ఇల్లు వాకిలి రాజ్య - మెల్ల యే మిటికి
తల్లి దండ్రులు అన్న - దమ్ము లేమిటికి
అత్త మామేటికి - విత్త మేమిటికి
ఇత్తనువున ప్రాణ - మిపుడు యేమిటికి

పతియె దైవము సతికి - గతి వేరె లేదు
పతి లేని సతిని వసు - మతి పితామహుఁడు
నేల బుట్టించె యీ - జాలి బొందుమని
ఈలాగు జేయుటే - నెరుఁగనే తొల్లి
నోచిన నోమెల్ల - బూచిగా వచ్చి
వ్రాచెగా నావిధి - వశ మిటు లుండె
అని యని దుఃఖించి - యజ్ఞాయతాక్షి
గొనకొని కోపించి - గుణవతిని జూచి
ఉరగమే వరు డని - సరస నేవేళ
శిరమున మోసుక - జరిగెద నేను
ధరగల పుణ్య తీ - ర్థముల తిరుపతుల
తిరుగ నాపాలిట - దేవుండు గలఁడు
పతి బాసి చరియించ - పాపంబు వచ్చు
పతి గుడువ కన్నంబు - మతి దప్పి గుడుచు
సతి కుక్కయౌ యెదిరి - పతికి మారాడు
సతి మూఁగి చెవిటియౌ - పతినగడు బరచు
సతి యూర బందియౌ - పతిని దూషించు
సతి ఖరమౌ కనలి - పతి బట్టి గొట్టు
సతి ప్రేతభూత మౌ - పతిని వంచించు
సతి పిశాచం బగు - నితరుల బొందు
సతి మాల కాకియై - కుతలమున బుట్టు
రని నీతి శాస్త్రంబు - లరచు గావునను

వనిత గాంధారియు - వగుని గుడ్డనక
కుంతియు పతి తెల్ల - కుష్ఠరోగనక
అంతేల రతివిభు - నంగ హీననక
శశిని రోహిణి పతి - క్షయ రోగి యనక
శశిదేవి విభు నేను - చెడు గన్ను లనక
ఇంత వారలు పతుల - చెంతనే నిలచి
వంతు కెక్కిరి తార - వసుధతనూజ
పాంచాల్యహల్యయు - పడతి మయు పుత్రి
పంచ కన్యలటంచు - నెంచ బడి రిలను
బడుగైన చెడుగైన - పదహీనుఁడైన
జడుడైన రోగైన - నడతీనుఁడైన
పామరుడైనాను - పాపైన గాని
ఏమైన యిదియు నా - నోము ఫలంబు
పాలు దధి బోసుక - పాలించు కొనుచు
భూలోకమున గల - పుణ్యభూములను
తాచును మోచుక - చూచి రావలయు
నీ చేతులారెత్తి - శేషునిమ్మనుచు
అత్తకు మ్రొక్కిన - అతి శోక మంది
చిత్తమున పొక్కుచు - చెలియ కిట్లనియె.

వ. ఇట్లు శోకంబు నొంది శేషు నిమ్మని యడిగిన త్రైలోక్య సుందరినిం గని గుండియల వేడిజెంది యగ్గుణవతి

త్రిపుట.

వనిత యెటువలె - జనియెదవె కా
ననమునను మృగ - ములును ఘన గిరు
లెనయ భూత పి - శాచములు వన
చరులు ఘనులూ. ౧

గలుగు పొలమున - కేల తరలెదు
చిలువ జాతక - ఫలము విప్రుల
పలుకు లన్నియు - చెలియ వినుముని
తెలియ బలికీ. ౨

తిరుపతులు తీ - ర్థంబు లెక్కడ
తెరవ లెక్కడ - ధరను వొంటిగ
వరుడు లేకను - తిరుగు తరుణికి
కొరత లొదవుగా. ౩

ఉరగమును శిర - మున ధరించుక
తిరుపతులు గన - నరిగె దనుచును
జరిగి పురునొక - తొరట నునిచారు
పిరు దరుగుదో. ౪

అనిన మనమున - కనలి వనితయు
ననియె తనయుని - గనిన జనని వి
గనక కనికర - మొకవె నను నిటు
లనగ దగునే. ౫

మానహీనగు - హీనమగు విన

రాని పలుకే - వినగలిగె నను
మాన మేటికి - శ్రీపతొకడె నా
మన సెరుగునూ. ౬

అమ్మ నే జె - ల్లేమి జెపుదీ
విమ్మ శేషుని - సమ్మతిగ నే
నిమ్ములకు జనె - దమ్మ తోడగు
నమ్మ శౌరీ. ౭

వ. అని యిట్లుబలికిన త్రైలోక్యసుందరి నమ్మికపదంబు నెరింగి యగ్గుణవతి.

అటతాళము.

శనియు తనమది - కనలి ధనము భు
వనము తన రూ - పును జెరి
పినను తన మగ - డనిగ నెనసిన
వనిత బోలుద. ౧

అంతకునిచే - జిక్కు కాంతుని
రంతు జేసీ - తెచ్చియు
సంతసం బల - రంగ బొందిన
యింతి బోలుద. ౨

పసు పతియు తన - నొసటి కంటను
మసి నొనర్చు - మగనిని
రసిక మీరగ - దెచ్చి అలరెడు
రమణి బోలుద. 3

కల ధనము లిల - ముని కొసగి తను
వెలకు నమ్మె - మాలవై
ఒలుకు లమరిన - చెలువు గలసిన
కలికి బోలుగ. ౪

పురువె పురుషుడు - దైవ ముని నీ
కరము నన్ని - గొలువుము
తిరుణు డగునని - పురగ మెత్తియు
తరుణి కిచ్చెగ. ౫

వ. అని నచ్చుపురువు నిచ్చినం బుచ్చుకొని విచ్చేయు నప్పుడు ధర్మాంగదుండు వచ్చి త్రైలోక్యసుందరికి అడ్డమై నిలచి.

జం పె.

ఎందరిగెదవె నీవు - దందశూకమును గొని
డెందమున సందేహ - మొంద కేగెదవు. ౧
జగతి నేకాకివై - మగదిక్కులే కతివ
తగదు వొంటిగ నరుగ - ధర్మమే నీకు. ౨
ధన కనక వస్తు వా - హన సంపదలు నీడె
అనుభవింపుము నిలచి - చనవలదె యమ్మా. 3
కొడుకు నీవే నాకు - కోడలును నీవె నిను
విడువ నా కొక దిక్కు - వేరెలే దమ్మా. ౪
ఉచితంబు గాసిపను - లొగి జేసి యువనిపై
సచివుండు నా కొక్క - నడిదెచ్చె నమ్మా. ౫

చెనటి మంత్రికి యెంత - జెప్పినను నామాట
వినక తడు దెచ్చె నీ - విధివశమె యమ్మా. ౬
తొలుత మీ వారికే - తెలుపనై తాచనుచు
పొలతినా బుద్ధపుడు - పురువు దినె నమ్మా. ౭
మము విడిచి యిటు లరుగ - మగువ నీతి యటమ్మ
క్షమగలిగి యీతప్పు - సైరించ వమ్మా. ౮
అమ్మనా మాటకిపు - డడ్డమాడకు మరలి
రమ్మవిన రాజుగని - యమ్మగువ యనియెన్. ౯

వ. ఇట్లు పలికిన ధర్మాంగదునింగని త్రైలోక్యసుందరి.

త్రిపుట.

ఆహా రుద్రప్ర - తాప సాహస
భీముడవు మహా - రాజ నీవిటు
కూహకము మది - నెంచ ధర్మమె
వో మహీశా. ౧

తాచుగని మం - దాసనంబున
మూసి యింటను - దాచిబెట్టుక
నీసుతుం డని - మంత్రి సుతునకు
వేస మేసీ. ౨

వచ్చువారికి - మెచ్చజూపె
చ్చటికి వచ్చుట - తగదనియు వా

లిచ్చి బంపియు - తెచ్చితివి నను
కుచ్చితుఁడవై. 3

పెట్టు బెట్టియు - పుట్టు బోగని
గట్టి నాతల - బెట్టి పాపము
గట్టు కొంటివి - కట్టడై మది
గట్టి జేసీ. ౪

లేశమైనను - దోషమన కీ
మోస మేటువలె - జేసితివి నా
యాశలెల్ల ని - రాశ జేసితి
దోషకారీ. ౫

ధనము భువనము - సకల సంపద
ధవుఁడు లేనతి - వకు న దేటికి
జనులు నవ్వప-కీర్తి నడియును
జగతి నొడవున్. ౬

తిండిబోత్తై - పిండి వంటలు
వండి తిని మై - కండ బెంచియు
మెండుగ లే మిం - డనికి ని త్తిం
దుండ నేనూ. ౭

వ. ఇట్లు పలికిన కోడిలినిం జూచి ధర్మాంగదుండు

ద్విపద.

అంగనా నీకోర్కు - భంగ మే నెంచ
రంగ డెరుంగు నా - యంతరంగంబు

పన్నగ జాతక - ఫలము బ్రాహ్మణులు
విన్నవించిన మంత్రి - విని యిటు జేసె
నేనెన్ని జెప్పిన - నిజముగా గొనవు
పూనరానీపని - పొసగ జేయుదున
పుడమి నొంటిగనరుగ - పడతులకు తగదు
తడయక బోయిన - సడి నిందె లొదవు
వినరాని మాటలు - వెళ్ళ నాడితివి
వినవలసెనె నాదు - విధివశమనిన
మామరో వినవయ్య - మమతతో బలికె
దీమాట లేటికే - నిట నిలచి యున్న
మోదంబు తోడనా - మగ డితడనియు
ఈదేహ సౌఖ్యమే - నెవ్వరి కిత్తు
పతి లేని సతియు భూ - పతి లేని కోట
మతి లేని చదువును - సుతి లేని పాట
ధర లేని రాజు - ధాన్యము లేని పేట
తరుణి లేనిల్లు - తాళము లేని యాట
రవి లేని పగలు వివ - రము లేని మాట
కవి లేని సభ పూలు - గలుగని తోట
శశి లేని రాత్రిని - ర్జలమైన వూట
శిశువులు లేనట్టి - సిరిమెంచి చూడ
ఏటికి పతి లేని - బోటికి నిందె
మాటల కెడవాను - సాటి వారలలొ

ఈమాట లేలనా - కీసంప దేల
భూమేల ధనమేల - బోగంబు లేల
భూమిాశ నన్నింత - బోధించ నేల
మామకో నామిాది - మమత నీకేల
నీకు పుత్రుఁడు లేదు - నేను నీకేల
నీకు శోకం బేల - నిను నన నేల
నను గన్న తలి దండ్రి - నననేల మంత్రి
నననేల నొరులను - నననేల విధికి
ఎన్ని జెప్పినగాని - యేనిందు నుండ
కన్నతండ్రింటికి - కాంక్షించి బోవ.
పుణ్యతీర్థములకు - పుణ్యాశ్రమములకు
పుణ్య భూములకు నే - బోయి వచ్చెదను.
వద్దని జెప్పిన - వచ్చు పాపంబు
సిద్ధించు నీకు నా - హత్య యేమనకు
మని పదములకు న - మ్రగువయు ద్రొక్కి-
చనె పెట్టె తలఁడిడి - సంతాపముననూ॥

వ. ఇట్లు త్రైలోక్యసుందరి అత్తమామల వీడ్కొని గృహంబు వెడలి రాజమార్గంబునం జనునప్పుడు,

జంపె.

చిత్తమున చింతిలుచు - తత్తళింపుచు పెట్టె
నెత్తిబెట్టుక జనియె - మత్తగజయానా. ౧

చనుసపుషు పురజనులు - గనిమగలు మగువలును
మనములను శోకించి - ననిరి వారపుడూ. ౨

ఇట్టి పాపంబెట్టు - గట్టి ఒడి యీ సతిని
రట్టు జేయుంచె యీ - రాజనెడి వారూ. 3

మను జేశునకు నేమి - మర్మమో మగువపై
తన కేమి జేసె యీ - తరుణి యను వారూ. ౪

వటపలాధరిని వగ - లిటు గుంద జేయ యీ
మటమూయ బన్ని మతి - మంత్రి యనువారూ. ౫

పన్నుగా వరుని క - న్నుల జూడకెటు లిచ్చె
కన్నతం డ్రతడెంత - కట్ట డనువారూ. ౬

ఇన్ని మాటలునేల-యీ సుద్ధి విని మోచి
కన్న తల్లేమూనో-గానమను వారూ. ౭

కాల సర్పమును గని-బాలుడని పెట్టెనిడి
మూలనే దాఁచున్న-నీలినను వారూ. ౮

పుడమి మగడీనమై - యిడుము ల గుడును వగల
బడగ పడతియు నోము-ఫలమనెను వారూ. ౯

ఇట్టి కట్టపులుండు-పట్టణము లోనునికి
పట్టు మనకెట్టు లగు-నిట్టులను వారూ, ౧౦

పాము తల మోనుకొని-భూమిపై దిరుగ యే
నోము నోచెనో తొలుత-భామయను వారూ.౧౧

వ. మరియు కొందరు.

అటతాళం.

తరుణిపాపము-తల్లి తండ్రికో
ధరణి పతికో-మంత్రికో
ధరణిసురులకో-యెవరికోయని
మరుఁగవారూ. ౧

ఎవరి కేలగు - ఉరగమును గని
భువి వగుండూ - కొడుకని
అవని పేరిడి - యువిద దెచ్చిన
అతని కగునూ. ౨

అతని కేలగు - కౌతుకము నిల
పతి సుతుండూ - అని తన
సుతుని జూపియు - సతిని దెచ్చిన
పతికు కగునూ. 3

మంత్రి కేలగు - జాతకము నిజ
మంచుమంత్రా - మెంచెను
తంత్ర మిదియని - యెంచకిచ్చిన
తండ్రి కగునూ. ౪

ఇచ్చి నాతని - కేలవరునకు
మచ్చ కేతుం - డీడని
వచ్చి మాటల - మెచ్చ జెవుబా
పలకు నగునూ. ౫

వ. అని పురజనులు పెక్కువిధంబులం దూఁగి పలుకుచుండఁగా విని ధర్మాంగదుండు తన మనంబున.

త్రిపుట

రంగ గరుడతు - రంగ ముని జన
సంగ కల్మష - భంగ నవనిత
దాంగ శృంగా - రాంగ శౌరి భు
జంగ శయనా. ౧

పడతి మాటలు - వినియు దశరథు
డడవులకు కొడు - కులను కోడలి
నడలడఁ జెనని - యగుడు బడి భువి
మడిసె నతడూ. ౨

సుతుడు హితవని - జెప్ప విని ధృత
రాష్ట్రుఁ డనుజుని - సుతుల వెతలిడ
శత సుతుల జం - పించి వనముకు
సతితో నరిగెఁ. 3

కొడుకటనకను - కర చరణములు
నొడిసి రాజ న - రేంద్రుడును తన
పడతి మాటలు - వినియు పుడమిని
భంగ మొందెఁ. ౪

కపట మెంచియు - పురగమునకీ
కాంత దెచ్చియు - నడవి పాలుగ

ఇపుడు జేసెను - మంత్రి నాకప
కీర్తి దెచ్చెగా, ౫

తల్లి దండ్రులు - వచ్చి నను నా
తనయ నల్లుని - జూపు మన్నను
చెల్లబో నే - వారి కేమని
కల్ల జెపుదూ. ౬

భూమిలో నే - నేమి పాపము
పూని జేసితి - దైవమా యీ
భూమెలకు పా - లేల జేసితి
భోగి శయనా.

వ. అని శోకించు ధర్మాంగమునిం గని శోడలినిం దలంచి యు
గ్గుణవతి తన డెందంబునంగంది గుందుచు.

జంపె.

హా పద్మ సంభవా - అహికి సతివగు మనుచు
ఈపద్మముఖి తలను - ఎట్లు వ్రాసితివీ. ౧
ఇసుమంత దయలేక - వ్యసనమున శశిముఖిని
కసుగంద జేసితివె - వసుదేవ తనయా. ౨
పెద్దబుద్దని మంత్రి - బుద్ధి నిజమని వినగ
కొద్ది జేసెన మమ్ము - బుద్ధిమతిమంత్రీ. ౩
చంచలాక్షిని నేమి - వంచనలు మదినెంచి
కంచుకికి దెచ్చెనో - పంచ పాతకుడూ. ౪

ఖగము తల మోసుకొని - జగతిపై నొంటిగను
చిగురాకు బోణి యే - వగలగుదుబడునో. ౫

కమనీయమగురూపు - కాంతి రేఖ విలాస
రమణి లక్షణాలు విఫ - లములాయె నయ్యో. ౬

తరుణి భయ భక్తి తా - త్పర్య గుణశీలములు
మరచి యుండెదనన్న - మరపురా దయ్యో. ౭

మతిని పన్నగమె నా - మగడు దైవ మెంచు
పతివ్రతయు నేఁడడవి - పాలాయె నయ్యో. ౮

కటకటా దైవ మీ - గతిజేయు టే నెరుగ
మటుమాయ విధికి నే - మని మరుగుదయ్యో. ౯

వ. అని పెక్కువిధంబుల నగ్గుణవతి ప్రలాపించు సమయంబున త్రైలోక్యసుందరి పట్టణంబు విడచి చనునప్పుడు.

సీ. వ్యసన మోహంబులు ౹ వేరుతో తెగగోసి
దండశూకమె గురువు ౹ దైవమనుచు
పూజించి సేవించ బోవు ౹ పాపంబు యీ
భూషణంబేల మై ౹ పూజ్యమేల
ననుచు సొమ్ములు దీసి ౹ వనమాల మెడలేసి
వొడల బూడిద బూసి ౹ జడలు దాల్చి
కావి బట్టలు గట్టి ౹ పావకోళ్ళను మెట్టి
జపమాల కుండిక ౹ చేతబట్టి

గీ. దండమును బెట్టి హరినదగ నుండబెట్టి
జింకచర్మంబు జుట్టియు గ చంక బెట్టి
పురుష సన్యాసి వేషంబు గ పొలతి దాల్చి
పుట్టుబోగితో పెట్టె తల గ బెట్టి నడచె.

వ. ఇట్లు త్రైలోక్యసుందరి పురుషముని వేషధారియై అహర్ని
శంబులం భయభక్తితో శేషున కర్పించు క్షీరాన్న శేషం
బులు తా నారగించి పుణ్యనదుల స్నానంబు లాచరింపం
బూని చనుచు.

జంపె.

భాగీరథి భవాని - పాలనది కావేరి
వేగవతి నది కృష్ణ - వేణి పెన్ననదీ. ౧
గోదావరియు యమున - గోముఖియు బాహునది
హ్రాదినీ సింధు కా - ళింది శోణ నదీ. ౨
సరయునది గౌడగునది - జంబునది తమసనది
సరస్వతియు భీమనది - చక్షునలిని నదీ. ౩
తుంగభద్రయు గయయు - తోయదియు మాల్యవతి
గంగనది సీత గం - డికి కౌశికి నదీ. ౪
అమ్రవతి పంచవటి - అఖిముఖి నర్మదయు
తామ్రపర్ణమరనది - దక్షిణాంబు నదీ. ౫
భవనాశి ధనుకోటి - పద్మనది శంఖనది

పవననధి స్వర్ణముఖి - పాపనాశ నదీ. ౬
పన్నగముతోను భయ - భక్తితో నమ్మగువ
సన్నుతించియు నదుల - స్నానంబు జేసి. ౭

ద్వి ప ద.

శేష గిరి శంక గిరి - శ్వేత భద్ర గిరి
వృషభ గిరి గరుడ గిరి - వెంకట గిరియు
అంజన మనంత గిరి - ఆళ్వార్ల గిరియు
కుంజర గోకర్ణ - కుంత్య గిరి పాండ
రంగ గిరి నామ గిరి - రామ గిర నంత
రంగ నాథుని గిరి - సింగరి కమల.
గిరి అరుణ గిరి నీల - గిరి చిత్రకూట
గిరి గంధమాదన - గిరి మంధర గిరి
మోగిర గిరి తిరు - మూర్తుల గిరియు
నాగ గిరి శ్వేత గిరి - నారాయణ గిరి
ఏల గిరి శ్రీ వెంక - టేశుని గిరియు
సోలె గిరి బాల గిరి - స్వర్ణ గిరి మొదలు
ఉరగ మెన్నడు తనకు - పురుషుడౌ ననుచు
తిరముగా శేషుడే - దేవుడటనుచు
త్రైలోక్యసుందరి - తరలె నై మిశమ
నాలయంబునను కు - దాల తక్కోల
జంబులు నింబలు - జంబీర తరులు

రంబలు చింతలు - రావులు పనస
పూతము ల్పోకలు - సురపొన్న మణ్ణి
కేత కెలగలు నారి - కేళ మాదిఫల
సరళ బిల్వా మలక - చంపక వకుళ
తరుల నీడల పక్షి - తతి మృగావళులు
పగ లేక చరియించ - మగువ వీక్షించి
పొగడొంద నిది యొట్టి - పుణ్య దేశంబొ
యని తదాశ్రమభూమి - కరుగంగ నచట
అనఘు కశ్యపు కణ్వ - అత్రి పులస్త్య
వామదేవు మరీచి - వ్యాస వసిష్ఠు
జామదగ్ని అగస్త్య - జాబాలి సూత
శౌనక నారద - శాండిల్య దాల్భ్య
సనక సనందన - సనత్కుమారులును
శాండిల్య మార్కండ - చ్యవన మతంగు
మాండవ్య దూర్వాస - మౌద్గల్య కపిల
దమనుండు శుకబృహ - దశ్వ గౌతముడు
శమికు గాలవు సుతీ - క్ష్ణుడు వాల్మీకి
గార్గేయు శరభంగు - కౌశికుడు దంకు
భార్గవి జీవి భ - రద్వాజు లాది
గా రుషులను జూచి - కరముల్లసిల్లి
వారిమణి పన్నగ - నాథుని డించి

బెట్టి వారలకు సా - ష్టాంగ దండంబు
బెట్టి కరములు నుదుట - బెట్టి యిట్లనియె.

వ. ఇట్లు త్రైలోక్యసుందరి నైమిశారణ్యంబునకుం బోయి అచ్చట ముని బృందంబునుం గని దండంబు బెట్టి.

జంపె.

కరుణజలనిధులార - సరసిజుని సములార
పరమాత్ములార నా - పాలి గురులారా. ౧
యతులార ఘనులార - వ్రతులార మునులార
పతితపావన బిరుదు - మతి గలుగు దొరలురా. ౨
చనునదియు మనునదియు = గనునదియు గను తదియు
లనఘు లాత్మజ్ఞాను - లవని రక్షకులూ. ౩
వినరయ్య మునులార - వనజ సంభవుడహికి
వనిత గా జేసి నను - వగలు గుడిపించెగా. ౪
పాము పతియగా ననుచు - బహునదులు శైలములు
భూమి తిరిగితి దాన - పొందు లేదాయెగా. ౫
ఏకాకినై దిక్కు - లేకయిటు వచ్చితిని
నాకేమి జెప్పెదరు - నా సాములారా. ౬
పన్నగము మోను కె - న్నాళ్లు దిరుగుదు నన్ను
గన్నయ్య లారొక్క - గతి జెప్పరయ్యా. ౭

వ. అనిన యతి వేషధారిణియైన త్రైలోక్యసుందరినింగని అ

మ్మునీశ్వరులు యోగధ్యానంబున వీక్షించి.

సీ. శాల విను కాశ్మీర ౯ పతి సతుదరమునఁహి
బుట్ట శోకంబంది ౯ పుడమి సురల
రప్పించి జాతకము ౯ జెప్పుమన్నను వారు
ఒప్ప జెప్పిన మంత్రి ౯ యోచనలను
తనయు డంచును జెప్పి ౯ జనపాలకుల నిండ్ల
లక్షణ వతియైన ౯ లలన నరసి
దెచ్చిన పతికిని ౯ మెచ్చు లోదవు నటంచు
విప్రులం పిలయెల్ల ౯ వెదకి నిన్ను

గీ. జూచి మీవారికిని తన ౯ సుతుని జూపి
పట్టపాయుధమునకు నిక ౯ పరిణయంబు
జేసి తెచ్చుహిని మగఁడంచు ౯ జెప్పి జూఁప
వ్యసనమున గుంది పురుష యతి౯ వేసమేసీ.

త్రిపుట.

వేసటను భుజ - గమును మోసుక
దేశమున గల - నదులు నఘములు
జూచి స్నానము - జేసి నీవిటు
డాసి తబలా. ౧

అతివ విను పతి - వ్రతపు నీ పతి
గతమునను కుత - లాధి పతియై

వితర ణించుక - లేక తానవ
నీతిమతివై. ౧

భూసురో త్తము - లకును దానము
న్గానర క్షే - త్రంబు లిచ్చిన
దోసమున నీ - పతియు నిపు డహి
దొరగ బుట్టెగా. ౩

గరుడ గమనుని - కృపను నరగను
నరుడగును సా - మ్రాజ్య మేలును
సురులు నరవరు లెల్ల బొగడగ
ధరపతగునూ. ౪

చింతవలదిల - వంతుకెక్కెడ
వింతిగాతను - గ్రుంకియానది
పొంతనొక సర - సున్న దందున
పురుషు డగునూ. ౫

మగువరో పొ - మ్మనుచు మునులన
చిగురు బోణియు - సంతసంబున
తగవు మీరగ - దండమిడి చనె
తరుణి యపుడూ. ౬

వ. ఇట్లు తన వృత్తాంతం బంతయు నమ్మునీశ్వరులు జెప్పిన సంతసంబంది దృఢ మతియై దండంబు వెట్టి వార లనుమతింగైకొని త్రైలోక్యసుందరి ముఖ్యదేశంబులు సంచరింప దలంచి చనునప్పుడూ.

జంపె.

కెందరాళ పలాశ - కదలి పిప్పలి పనస
తిందుక వకుళ నింబ - తింత్రిణీ బదరీ. ౧
సురపొన్న జంబీర - వరుణ శారద రేల
కరవీర మాలూర - ఖర్జూర వేముల్. ౨
మారేడు చూతవట - నేరేడు సహకార
పారిజాతప్లక్ష - నారికేళములూ. ౩
గార తిలక ప్రియక - వీరతరు డాదిమలు
బూరుగ పిచుల కోవి - దార ఆమలకల్. ౪
సరళ కనక శిరీష - కురువక వెదురు పోక
తరులు ఫలములు సతికి కరుణ నందిచ్చుఁ. ౫

వ. ఇట్టి వనంబున త్రైలోక్యసుందరి తిరలునప్పుడు.

ఏ క తా ళ ం.

గండకములు భే - రుండ సృగాలవ
కుండలి సూకర - పుండరీకములూ. ౧
కరి వృక కేసరి - హరిణ సివంగులు
తరుచర భల్లుక - శరబలు లాయల్. ౨
చమరీ మృగ మా - ర్జాల శశక శల
భములు దుప్పలు గవ - యవములు గణుతుల్. ౩
సారెకు మృగములు - చేరిరు గడలను
నారీమణికిని - దారులు జూపుఁ. ౪

కాక కటక టి - ట్టిబకల కంఠక
కోకిల చిలుకలు - గోరంకులునూ. ౫

గూక మరాళళి - కోయష్టిక చక్ర
వాక చకోరక - కేకి బకములుఁ. ౬

రెక్కలు విప్పక - నక్కమలాక్షికి
నిక్కుచు నీడగ - పక్కులు వచ్చుఁ. ౭

భూత పిశాచులు - భేతాళంబులు
భీతిల వలదని - నాతికి దెలుపుఁ. ౮

ఘన ముని వరుడని - వనిత పదములకు
వనచరులును గని - వలగొని మ్రొక్కుఁ. ౯

వ. ఇవ్విధంబున త్రైలోక్య సుందరి నవ్వన మహిమంబులు కనుంగొని అతిశయం బంది కాశీపట్టణంబు జేరి గంగానదిని స్నానంబుజేసి విశ్వనాధుని దర్శించి, సాష్టాంగ దండప్రణామంబు లాచరించి కరకమలంబులు ముకుళించి—

జంపె.

ఫాలాక్ష ముని పక్ష - భక్తజన సంరక్ష
హాలా హలా భక్ష - అదితి జన రక్షా. ౧

శరణు గిరిజాధీశ - శరణు పాప వినాశ
శరణు శ్రీ పరమేశ - శరణు భూతేశా. ౨

శరణు పావక నేత్ర - శరణు శశి నిభ గాత్ర
శరణు పరమ పవిత్ర - శరణు హరి మిత్రా. 3

శరణు నాగా భరణ - శరణు మునినుత చరణ
శరణు గౌరీ రమణ - శరణు పురహరణా. ర
శరణు సర్వ గణేశ - శరణు లోకా ధీశ
శరణు కాశీ వాస - శరణు విశ్వేశా. శ

గీ. అనుచు నుతియించి యయ్యాలి నీలవేణి
కాలభైరవునకు మ్రొక్కి కంబు కంఠి
అన్నపూర్ణ విశాలాక్షి కంజ లిడియు
వేగమున నరిగె మగువ ప్రయాగ కపుడూ.

త్రి పు ట..

బ్రహ్మ తల ద్రుం - చిన శివునకును
బ్రహ్మ హత్య వ - హించ బాపిన
బ్రహ్మ జనకుం - డైన యా పర
బ్రహ్మమైనట్టే. ఆ

మాధవుని పద - పద్మములకును
మోద మలరగ - మ్రొక్కి యాసతి
మేదినికి సవ - తైన యా పా
దోధి సుతకుట్టే. పా

దండమిడి చం - డీశు కరమున
నుండు బ్రహ్మ క - మండలము భూ
మండలిని బడ - జేసితివి వే
దండయానా. 3

కరుణ లేకే - పురగమునకును
తరుణిగా నొన - రించె సచివుడు
పురువు నరుడయి - పురుషు డగునని
కరము నెన్నీ. ౪

జూచి మోసుక - పుణ్య భూములు
జూచి నీ స - న్నిధికి వచ్చితి
కాచి నను ర - క్షించు నే బహు
నీచ మతినీ. ౫

వ. అని నుతియించి వందనంబు లాచరించి-

కు రు చ జం పె.

పురుషోత్తమునకు తా ♦ నరిగీ ♦ ఉరగ
వరునితో నుదధిలో ♦ మునిగీ. ౧
మదన జనని పదముల ♦ కెరగీ ♦ చెలియ
ఎదువరుని సన్నిధికి ♦ నరిగీ. ౨
శ్రీజగన్నాదు పూ ♦ జించెన్ ♦ యింతి
ఆ జగన్నాధు ♦ భజియించెన్. ౩
నీల మేఘు శ్యాము ♦ లాంగా ♦ భక్త
పాల గోపాల భవ ♦ భంగా. ౪
రాధ మది కమల మధు ♦ భృంగా ♦ శౌరి
వేద గోచర వెన్న ♦ దొంగా. ౫

నంద నందన హృషీ ♦ కేశా ♪ మాని
  వందితామర ఇంది ♦ రేశా. ౬
ఫణి శయన పరమపద ♦ సదనా ♪ కనక
  మణి మకర కుండలా ♦ భరణా. ౭
తరుచ రాశ్రిత దనుజ ♦ హరణా ♪ దంతి
  వరద నరహరి కంస ♦ హరణా. ౮
నిటలాక్ష పక్ష మాం ♦ పాహీ ♪ కృష్ణ
  వటపత్ర శయన మాం ♦ పాహీ. ౯

వ. అని వినుతించి త్రైలోక్యసుందరి వందనంబులు సమ
  ర్పించి.

సీ. లావుకేశ్వరు మడుగు ♪ లక్షించి గ్రుంకియు
    శ్వేతగంగను దోగి ♪ దాత జనకు
  పదము కాత్యాయని ♪ సదనంబు సిద్ధ వ
    టంబు డోలా మంట ♪ పంబు ముక్తి
  మంటపంబును బోగి ♪ మంటపం బభిషేక
    మంటపము వేయికాళ్ల ♪ మంటపంబు
  గని అంజలిడియు మా ♪ ర్కండేశ్వరము రోహి
    ణీ గుండ మిందు గుం ♪ డమున మునిగి

గీ. వచ్చి మ్రొక్కి జగన్నాథు ♪ వద్ద జేరి
  బూరె లతిరస చక్కెర ♪ పొంగలి ప్ర
  సాదమును స్వామి కర్పించి ♪ మోద మలర
  దశనికులు నచట వసియించె ♪ తలిరు బోణి.

ద్విపద.

చనియె మాయాపురి - సర్వ పురమునకు
వనిత శ్రీకాకుళ - వాసున కెఱగి
అంజన గిరి కేగి - హనుమంతు కెఱగి
రంజిల్లు శ్రీపాండు - రంగున కెఱగి
శ్రీకూర్మ శ్రీముష్ణ - శ్రీశై లయోధ్య
ఆకాశ పురియు గం - గా సాగరంబు
శ్రీకరం బైనట్టి - సింహాచలంబు
గోకర్ణ పురముకు - గోష్ఠి పురమునకు
వారణాశ్రమ మధు - రావార మునకు
ద్వారావతికి హరి - ద్వార మాహురకు
నారాయ ణాశ్రమ - నంతశయమునకు
వారణా చలము పు - రాశ్రయ మునకు
లోలార్క మునకు న - హోబలమునకు
మేలు కోటకు నరిగి - మెలత చెలపిల్లె
కెఱగి పెరుంబుదూ - రేతి రాజులకును
తిరుపళ్ళి స్వామి శ్రీ - తిరువడిగళుకు
మించిన భక్తితో - మెలత సేవించి
కంచి పురమున కరిగి - కరి వరదులకు
అతి మోదమున మ్రొక్కి - అచ్చోటు విడచి
అతివ మోదించి శే - షాద్రి కేతెంచి

గోవింద రాజుల - గోరి సేవించి
భావించి చూచి యా - పడతి యిట్లనియె
ఆనంద గోవింద - అతి దయా సాంద్ర
ఓ నంద నందన - ఓ కుంద రదన
ఓ సుంద రానన - ఓ యింది రేశ
ఓ సింధు గంభీర - ఓ శేష శయన
నే నిందు వచ్చితి - నిఖిలేశ నన్ను
పూని రక్షించు మి - ప్పుడు నమ్మినాను
అని మ్రొక్కి కొండ తా - నప్పుడు యెక్కి
ఘనమైన గుళ్ళను - ఘనమంటపములు
కను గొని సేవించి - కమలాయ తాక్షి
కనకంబు చేమించి - కాంతి చెన్నొందు
దేవాలయములోన - దివ్య మైనట్టి
శ్రీ వెంక టేశుని - చిత్తమం దునిచి
ముమ్మారు వలగొని - మ్రొక్కి యిట్లనియె
ఇమ్మహి యెల్లనే - నిప్పుడు దిరిగి
వచ్చితి నన్ను యె - వ్వరు గావరైరి
హెచ్చుగా శ్రీవెంక - టేశ నీవైన
చేపట్టి రక్షించు - శ్రీనాధ నాకు
దాపు నీవనుచు నీ - దండ జేరితిని
పరమాత్మ సర్వేశ - భగవంత కృష్ణ
నరహరి లక్ష్మీశ - నారాయ ణనుచు

నుతి జేసి యచ్చోట - నుండియు తరలి
యతి వేష ధారియై - యంబుజ వదన
వనములు గిరులును - వలనొప్ప గడచి
చని పుండరీకాక్షు - సదనంబునకును.

వ. ఇట్లు పుండరీకాక్షుని సన్నిధికి వచ్చి నారాధించి నమస్కరించి నభినుతు లొనరించి-

జంపె.

పుండరీకాక్ష బ్ర - హ్మాండ నాయక శౌరి
అండజాధిప గమన - కుండలీ శయనా. ౧
భాను కర హర చక్ర - పాణి నారాయణా
వేణు నాద వినోద - చాణూర హరణా. ౨
కేశవాచ్యుత హృషీ - కేశ ముని జన తాప
నాశ నరహరి రమా - ధీశ భవ నాశా. ౩
పాల నిధి శయన గో - పాల సుర పరిపాల
నీల నిభ దేహ జగ - జ్జాల పరిపాలా. ౪
వనజాక్ష మునిపక్ష - వనజాసనా రక్ష
కనకాక్ష శిక్ష శ్రీ - కౌస్తుభా వక్షా. ౫

వ. అని త్రైలోక్య సుందరి పరమపదనివాసునికి పరంజ్యోతియై ఉభయ కావేరి మధ్యమున నున్న శ్రీరంగశాయికి ఆలయంబైన భూలోక వైకుంఠంబనంబఱగు శ్రీరంగంబునకు వచ్చి తిరుక్కావేట తీర్థంబులాడి చంద్రపుష్కరుణి,

బిల్వ, జంబు, అశ్వత్థ, పలాశ, పున్నాగ, వకుళ, కేదంబ, ఆమ్రాది నవతీర్థంబుల నాగేంద్రసమేతంబుగా స్నానంబు జేసి, పరమ భాగవత పన్నిద్దరాళ్వారులకుం బ్రణుతించి, కస్తూరి రంగనాయకుల సేవించి, శ్రీరంగనాయకి సన్నిధికిం బోయి దండంబులు సమర్పించి, పరవాసుదేవుల నమస్కరించి, జయవిజయుల సేవించి.తిరుప్పైట్టి దర్శించి, ప్రదక్షిణంబు లొనరించి, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండైన శ్రీరంగనాయకుల సన్నిధికిం బోయి, దర్శించి, పూజించి, భజియించి.

అ ట తా ళ ం.

కేశవా నా - రాయణా పర
వాసుదేవా - మురహర
శ్రీశ దశవిధ - రూప కల్మష
నాశ శరణూ. ౧

గరుడ గమన - సురేంద్ర వందిత
పరమ పురుషా - శ్రీధర
సరసిజోదర - సుర నదోద్భవ
చరణ శరణూ. ౨

వేణు నాద వి - నోద గోప జ
నానుమోదా - నారద
వీణె నాద ప్ర - మోద జానకి
నాథ శరణూ. 3

వనజభవు జన - కహి శయన హరి
వనజ నయనా - మాధవ
దనుజ మర్దన - కుసుమ సాయక
జనక శరణా. ४

చారు సద్గుణ - ధామ సంగర
భీమ రామా - నగధర
ధారుణీ సతి - కామ శ్రీరంగ
ధామ శరణా. ౫

వ. అని వందనంబు లొనర్చి.

సీ. దశరాత్రు లందుండి ✠ తరలాక్షి చనె కుంభ
కోణంబునకు చక్ర ✠ పాణి సన్ని
ధికి నేగి దండంబు ✠ లిడియును సారంగ
పాణికి మ్రొక్కి యే ✠ ణాక్షి నరిగె
మధుర మీనాక్షమ్మ ✠ పదముల కెఱగియు
దర్భశయనమునకు ✠ తరలి దనుజ
మదనుని సేవించి ✠ మన్నారు కృష్ణుని
దర్శించి చూడికుడు ✠ తమ్మ సన్ని
గీ. ధాన మునకేగి సాష్టాంగ ✠ దండ మిడియు
తింత్రిణీవాసు లాళ్వార్ల ✠ చెంత జేరి
మ్రొక్కి వారిధి కరిగియు ✠ మునిగి లేచి
రమణి చనె వేగ రామేశ్వ ✠ రమున కపుడూ.

వ. ఇట్లు రామేశ్వరంబునకుంబోయి, రామలింగంబునుం దర్శిం
చి, ప్రదక్షిణంబు లొనరించి. పూజించి. భజియించి.

జంపె.

దండంబు పాలాక్ష - దండంబు విషభక్ష
దండంబు ముని రక్ష - దండ మిల రక్షా. ౧
దండంబు పునుక ధర - దండంబు శూల ధర
దండంబు చర్మ ధర - దండ మిందు ధరా. ౨
దండంబు నగవాస - దండంబు గౌరీశ
దండంబు భూతేశ - దండంబు ఈశా. ౩

వ. అని వందనంబు లొనర్చి, త్రైలోక్యసుందరి ముఖ్యదేశం
బులు సంచరించి, తద్దేశవాసుల సేవించియు నెట్టి ప్ర
యోజనంబు లేనందువల్ల మునీశ్వరుల వచనంబులు దలంచి
దురితహరుండైన నరహరిని సేవింపం దలంచి।

జంపె.

ధర్మార్థ కామ మో - క్షముల కాధారమౌ
కర్మ రహితంబైన - ధర్మపురి కరిగెన్. ౧
మేడ లిండ్లును విప్ర - వాడలును గురుల కిరు
మాడిగలు వాడలును - చూడ వేడుకగున్. ౨
పారులును భాగవత - రామాయణంబులును
భారత కథలు వేద - పారాయణంబులునూ. ౩

ద్రావిడ ప్రబంధములు - దనరు శ్రీకోశములు
భావమలరగ చదువు - పరమ వైష్ణవులూ. ౪

నేమముతో యజ్ఞ యా - గాది జప తపములును
హోమంబులును జేయు - సోమయాజులునూ. ౫

వైరాగ్యములు గలుగు - వైష్ణవోత్తములకును
భూరి దానము లిచ్చు - పుణ్య వర్ధనులూ. ౬

వరుసతో నింటింట - వ్రత నోములును సలిపి
అరసి జేతురు అతిథి - కన్న దానములూ. ౭

చరమాధికారులు త్రి - దండ సన్యాసులును
అరయరులు జియ్యరులు - పరమ వైష్ణవులూ. ౮

తిరునామధార్లు బై - రాగులు దిగంబరులు
పరమ హంసలు మునులు - బ్రహ్మచారులునూ. ౯

బావులును చెరువులును - దేవళంబులు స్వామి
సేవకరిగెడు జనులు - చెలగి వేయివేలూ. ౧౦

వాసవుని పురిబోలు - కేశవుని పురిబోలు
భూసుర జ్యేష్ఠ పురి - బోలు ధర్మపురీ. ౧౧

వ. అట్టి పట్టణంబునుం గని త్రైలోక్యసుందరి సంతసంబంది వందనంబులు జేసీ.

కురుచజంపె.

చింతామణీ తటిని ¶ మునిగీ
అచ్చుటను ! మంతునకు సాష్టాంగ ¶ మెఱగీ. ౧

ఉక్కు కంబమునకును ॥ మ్రొక్కి
ఇంతి ! చక్కగా కోనేట ॥ గ్రుంకి. ౨

దానంబు విప్రులకు ॥ నిచ్చి
తరలి ! శ్రీనాథు కోవెలకు ॥ వచ్చి. ౩

పంచవిధ వాద్యముల ॥ తోడా
నందు ! ఇంచుబోణులు నాట్య ॥ మాడా. ౪

కడలేని దీపములు ॥ వెలుగా
జనులు ! గుడిచుట్టు దండములు ॥ చెలగా. ౫

కొందరును పుష్పములు ॥ బెట్టా
మఱియు ! కొందరును కానుకలు ॥ బెట్టా. ౬

వడలతిరసములు అ ॥ ప్పములూ
మంచి ! గుడములును కుడుము లి ॥ డ్డెనలూ. ౭

అన్నంబు పప్పు పుల ॥ గంబూ
పాయ ! సాన్నంబు నారికే ॥ ళంబూ. ౮

బూరెలును పెరుగుప ॥ చ్చళ్ళూ?
నెయ్యి ! మోరు కదలులు గారు ॥ మెళ్ళూ. ౯

సారమగు వస్తువులు ॥ నుంచీ?
స్వామి ! కారగిం పొప్ప జే ॥ యించీ. ౧౦

మంగళారతులు వెలి ॥ గించీ
నార ! సింగరికి దండ మ ॥ ర్పించీ. ౧౧

వ. ఇట్లు సకల జనంబులు షోడశోపచారంబులు జేసి, తీర్థ

ప్రసాదంబులు గొనుచుండగా జూచి, త్రైలోక్యసుందరి బంగారు గరుడకంభమున కంజలి జేసి, మదన జనకుని హృదయమున నుండజేసి, ముమ్మారు కోవెల వలప్రదక్షిణంబులు జేసి, నరహరి సన్నిధానంబునకువచ్చి, ఆరాధించి, సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, కరకమలంబులు ముకుళించి,

సీ. ప్రహలాద పక్ష పాం । డవ పక్ష శ్రీ వక్ష
గజ రక్ష హర పక్ష । కంస శిక్ష
కమ లాక్ష సుర రక్ష । కనకా సురా శిక్ష
కన కాక్ష శిక్ష కౌ । రవ విపక్ష
కరుణా కటాక్ష కౌ । స్తుభ వక్ష భూ దక్ష
కోదండ దీక్ష గో । పాల రక్ష
పక్షి రాజ ద్రక్ష । పాప శిక్ష విచక్ష
కౌశిక సంరక్ష । కాక పక్ష

గీ॥ దుష్ట జన శిక్ష కరి శిక్ష । శిష్ట రక్ష
జంత కుచ విష భక్ష జగ । దేక రక్ష
దశముఖ విపక్ష దానవ । దళిత శిక్ష
భక్త జన పేక్ష యిందిర । ప్రాణ పక్ష.

వ. అని మఱిన్ని వినుతించి.

త్రిభంగి.

తోలు జగువులు గొను - ఖలు లను దునిమియు

జలజజు కొసగగ - జలచరమయితివి
వందె హరి వందే - నర హరి వందే. ౧

తరి గిరి ధరుడయి - తరచిజలధిసుధ
సురల కొసగితివి - ధర కమఠమవయి
వందె హరి వందె - నర హరి వందే. ౨

కనకనయను హరి - గొనిధరవనిత వె
సనములనుడుపగ - ఘన కిటి వయితివి
వందె హరి వందే - నర హరి వందే. ౩

కనకకశిపు వధ - గొనియు యతని సుతు
మనిచితి వతనిని - ఘన నర హరి వయి
వందె హరి వందె - నర హరి వందే. ౪

పుడమి బలి నడిగి - నడచి సురపతికి
జడియ కొసగితివి - పొడి వడుగడవయి
వందె హరి వందె - నర హరి వందే. ౫

ఇరువది యొక తల - మర నర పతులను
అరసి నరికితివి - పరశుధరుడ వయి
వందె హరి వందె - నర హరి వందే. ౬

జనకు వచనముల - వనముల కరిగియు
ధనుజుల దునిమితి - వినకుల వరుడయి
వందె హరి వందె - నర హరి వందే. ౭

జలజజు భజనను - ఖలులను దునిమియు
ఇల బర ముడుపగ - హల ధరు డయితివి

వందె హరి వందె - నర హరి వందే. ౮

జలజ నయనులతో - కిలకిల నగవుల
కలసి మెలగితివి - కలికి కృష్ణుడ వయి
వందె హరి వందె - నర హరి వందే. ౯

కలియుగమున గల - కలుషము లణగగ
ఖలుల నణతు వట - కలికి ధరుడ వయి
వందె హరి వందె - నర హరి వందే. ౧౦

మదన జనక విధు - వదనకు దర ధర
ఉదధిసదన మృదు - పద కమలములకు
వందె హరి వందె - నర హరి వందే. ౧౧

వ. అని వినుతించి.

జంపె.

ధర గలుగు పుణ్యా తీ - ర్థములు తిరుపతు లెల్ల
అరసి సేవించి నీ - దరికి వచ్చితినీ. ౧

తల్లి దండ్రియు గురువు - దాత దైవము నీవె
ఎల్ల బందువులు నా - కెంచగా నీవె. ౨

కంభమున గలడనిన - డింభకుని గాచితివి
అంబరీషుని శబరి - నహల్య గాచితివీ. 3

నరుని సుగ్రీవు న - క్రూరు ధ్రువు గాచితివి
హరుని గోపిక లజా - మిళుని గాచితివీ. ౪

కరిని ద్రౌపతిని రు - క్మాంగదుని గాచితివి

శరణను విభీషణుని - పరగ గాచితివి. ౫

శరణాగతుల బ్రోవ - బిరుదు నీదే గాని
ధర వెతుక లేదితర - దైవంబు నకునూ. ౬

పాల ముంచిన నీవె - నీళ్ల ముంచిన నీవె
పాలనిధి శయన గో - పాల నను గావూ. ౭

ఆశలెల్లను కోసి - వేసి వేసట బడితి
దేశమున లేదు దే - వుండు నాపాలా. ౮

ఎంచి రక్షించిన ను - పేక్షించినను నీవె
అంచితంబుగ కీర్తి - అపకీర్తి నీదే. ౯

వ. అని విన్నపం బొనరించి, వందనంబులు జేసి, శేషునకు క్షీ
రాన్నంబులు బోసి, తచ్ఛేషంబు తా నారగించి ఆరాత్రి
అచ్చట వసియించి.

కు రు చ జం పె.

మగువ ప్రొద్దున మేలు గాంచీ ♦ పెట్టె
ఖగముతో చంక సం ధించీ. ౧

మునులు జెప్పిన పలుకు లెంచీ ♦ వేగ
చనె గౌతమీ నది గు రించీ. ౨

చయ్యనను నది కనుల జూచీ ♦ చెలియ
చెయ్యెత్తి మ్రొక్కి నుతి జేసీ. ౩

ఎన్ని జన్మంబులను జేయూ ♦ భవము
లన్నియును కనుల గన బాయూ. ౪

ఎన్నంగ రాని పా ఽ పములూ ♦ గ్రుంక
అన్నియును అప్పుడే ఽ వెడలూ. ౫

సామి నా భాగ్య మెటు ఽ లగునో ♦ రామ
పామెన్నటికి పురుషు ఽ డగునో. ౬

అనుచు నరహరిని మది ఽ నుంచీ ♦ భోగితో
వనిత స్నానం బాచ ఽ రించీ. ౭

పాముగా నుండగా ఽ జూచీ ♦ యింక
ఏమి జేయుదు నంచు ఽ దలచీ. ౮

ఎంత పాపిష్ఠినో ఽ గానా ♦ నన్ను
సంతరిం చొక సామి ఽ గానా. ౯

మెండు భవముల చెండు ఽ చుండూ ♦ బ్రహ్మ
గుండ మా నది దండ ఽ నుండూ. ౧౦

గంధగజ యాన నం ఽ దరిగీ ♦ వగల
గుంది యందుండి మది ఽ కలగీ. ౧౧

వ. ఇట్లు త్రైలోక్యసుందరి గౌతమీ నదిని స్నానంబు జేసి సర్పాకారంబుగా నుండ జూచి మునుల పలుకులు తప్పె నంచు బ్రహ్మగుండంబను మడువు వద్దికి వచ్చితన చిత్తంబునం జింతాక్రాంతయై తహతహ పాటొంది మండిపడి కూర్చుండి నిట్టూర్పులు నిగుడించుచు.

జంపె.

అయ్యయో యింక నే - నెయ్యెడకు బోదునని

చెయ్యి చెక్కిట జేర్చి - కుయ్యిడగ దొణఁగెఁ ౧

హా లోక నాథ న - న్నేల బుట్టించితివి
ఈలీల నాపదల - జాలి మాలొందఁగఁ. ౨

తొలుత నడిచిన వెల్ల - తెలియ బలుకగ మునుల
పలుకు నిజమని తనువు - నిలిపి తిన్నాళ్లుఁ. ౩

నిలుపనిక ప్రాణములు - అలసి తలసటలు బడి
తిల దిరిగి బడలితిని - సొలసి నలఁగితిని. ౪

నడువ బోయితె నడలు - తడబడిని యొడలెల్ల
జనువు లడరెను బడలె - పుడమినిక బ్రతికి. ౫

బతిమాలి యెటుల నే - బ్రతుకువారల పంచ
గతిమాలి బనుదు సి - గ్గభిమాన ముడిగి. ౬

ఎవ్వరికి బారౌము - ఎవ్వరిని నాశింతు
ఎవ్వరిక రక్షకులు - ఎవ్వరిక దిక్కూ. ౭

దాపొకటి లేక నే - తరుణినై జనియించి
ఏపాప పుణ్యంబు - లెరుగ లే నైతిఁ. ౮

జగతిలో నేవృథా - జన్మ మెత్తితిగదా
భగవంత నను వగల - పాలు జేసితివే. ౯

వ. అని మఱిన్ని.

అటతాళము.

ఇలను ఘనత - వహించు ధరపతి
ఇంట బుట్టి - దూదికి

చులుక నైతిని - పాల కన్నను
పలుచ నైతిగా. ౧

వక్కవలె న - న్నొక్కతెను గని
దుఃఖమునసూ - తల్లి దం
డ్రక్కటా ఏ - మౌదురో యని
పొక్కి యేడ్చిరే. ౨

ముల్లువలె పది - నెల్లు కడుపున
మోశి నన్నూ - గాంచిన
తల్లి యెటువలె - మొత్తుకొని తను
గుల్ల లగునో. ౩

ఏఁట బెరిగెడి - దాని నన్నొక
పూఁట బెంచూ - తండ్రీ
మాట విని యే - దుఃఖ సాగర
నీట బడునో. ౪

కోడలని నను - దలచి భూపతి
గుణవతియునూ - ఏమని
గోడు గుడుతురో - దైవమూ ఏ
జాడనైరో. ౫

పుట్టు భోగికి - గట్టి నన్ని
రట్టు జేయూ - మంత్రికి
కట్టడికి నా - పాప మతనికి
జుట్టుకొనదా? ౬

జనన భూమికి - నరిగెదన సరి
జనుల తల్లీ - దండ్రిని
గనియు వారల - కేమి జెప్పుదు
కమల నయనా. ౭

ఏమటని యీ - పాము మోసుకొ
నెట్లు బోదూ - దైవమ
ఈ మడుగున బ - డిపుడు ప్రాణము
లేను విడచీ. ౮

ఆవలైనను - మగనితో సుఖ
మందు ననుచూ - నచ్చెలి
భావమున దలఁ - చహిని యొడి నిడి
పలవరించెన్. ౯

ద్విపద.

పన్నగంబును జూచి - పతివ్రతా తిలక
కన్నుల నీరేఱు - కాలువై బార
పతియని మోసుక - గతినీవె యనుచు
యతి వేసమున తిరు - పతులు భూమెల్ల

తిరిగి తిరిగియు నేను - దిమ్మరి నైతి
చూరరాని నదులెల్ల - చొచ్చి వేసరితి
ఎక్కని గిరులెల్ల - యెక్కి వేసరితి
మ్రొక్కని దైవాల - మ్రొక్కి వేసరితి

నేను ప్రాణము లింక - నిలుప నేజాల
ఈ నీట ప్రాణంబు - నిపుడు విడిచెదను
నా జీవితేశ ప - న్నగ రాజ యింక
నీ జీవ మెట్లానో - నే నేమి జేతు
జగతీసురులు నీదు - జాతక మరసి
జగ మేలుదువటంచు - జెప్ప మా తల్లి
ఆశచే నిన్ను మం - దాసనంబునను
మూసి బెట్టుక పాలు - బోసి నిను పెంచె.
అట్టి నీ తల్లితో - నారడి బెట్టి
పట్టినపట్టుగా - పెట్టితో నిన్ను
తెచ్చి నిన్నిప్పు డీ - తెరువు జేసితిని
వచ్చె పాపంబు నిక - నిచ్చట విడిచి
పెట్టిన జనులు నిక - పెను బాముటంచు
పట్టి గొట్టుదురో నిక - పక్షీంద్రు డొడిసి
పట్టి భక్షించు నో - పుట్టలో విడిచి
పెట్టి బోయితి నేని - పురుష ద్రోహంబు
గట్టు కొంటిని విధి - గడవ నా వశమె
అనియని వావిచ్చి - హాయని యేడ్చి
మనసు దృఢబరచుక - మదిరాక్షి యింక
సందేహ మేలని - చయ్యన లేచి

దండశూకంబుతో - మందాసనంబు
వసుధపై నిడి వీర - వాకిలి జేసి
బిసరు హాక్షియు చీరె - బిగియించి గట్టి
కుప్పసము ముడి గట్టి - కురులు బిగ గట్టి
తప్పక విభునకు - దండంబు బెట్టి
కరములు ముకుళించి - మెరుగారు బోణి
నరహరి మురహరి - మరుజనక శౌరి
ఆపదోద్ధారక - ఆర్త జనరక్ష
పాప సంహారక - భక్త మందార
కంది బందానక - దుందుభి నంద
సింధుర వరద గో - విందముకుంద
ఈశ గౌరీశ కై - లాసనివాస
కాశి విశ్వేశ భవ - పాశ వినాశ
మేరు నఘు వాస పర - మేష్ఠి లోకేశ
నీరజాసన బ్రహ్మ - నిగమార్థ నిష్ఠ
భారతి పార్వతి - భగవతి దుర్గ
క్షీర వారధి పుత్రి - శ్రీమహా లక్ష్మి
ధరణి గగనవాణి - దశ దిశలార
పరువడి అష్ట ది - క్పాలకులార
భువి గల జనులార - పుణ్యాత్ములార

నవగ్రహ పతులార - భవదూరులార
గరుడ ఖేచర సిద్ధ - గంధర్వులార
సరులార సురులార - నాగేంద్రులార
కిన్నర ముని యక్ష - కింపురుషులార

తిన్నగా వినుడి నే - విన్నవించెదను
తల్లి కడుపున నుండి - వెళ్ళినది మొదలు
తెల్ల వెల్లని పాలు - నల్లవియు నీరు
అని యెంచితిని గాని - అహికి నగ బడియు

కన నొక పుణ్య పా - పం బేను యిపుడు
పన్నగంబును మీరు - పాలింపు డనుచు
విన్నపం బొనరించి - వెలది యాబ్రహ్మ
గుండంబు లోపలి - కురుక బోవంగ

అండంబు నందుండి - ఆకాశవాణి
ఘనఘనా ఘనముతో - గర్జించియిట్లు
మనుజ భావలతోడ - మానిని కనియె.

వ. ఇవ్విధంబున బహువిధంబుల ప్రలాపించి, త్రైలోక్యసుంద
రి ప్రాణత్యాగంబు సేయ నిర్ణయించి;బ్రహ్మగుండంబునం
బడబోవ నప్పుడు ఆకాశవాణి.

త్రి పు ట.

బాలవిను త్రై - లోక్య సుందరి

•వోల నీటిలో - బడియెదవు యీ
కాలమున నా-పలుకు నీవిపు
పాలకించూ.

బ్రహ్మ గుండము - మహిమ విను బహు
పాపములు నేడ - బాయు మునిగిన
బ్రహ్మవధ పశు - వధయు శ్రీవధ
బాలవధయూ. ౨

తల్లి బిడ్డల - తోడ బుట్టుల
వుల్లమున కా - మించు పాపము
కల్ల బలికిన - యిల్లు గాల్చిన
కలుషములునూ. ౩

భూసురోత్తము - లకును దానము
వూసరక్షే - త్రంబు లిచ్చిన
దోసమును - విశ్వాస పాతక
దోషములునూ. ౪

కొండెములు బలి - కిన భవము సభ
నుండి పక్షము - బలుకు పాపము
బండనమునం - దోడి బారిన
పాపములునూ. ౫

పతివ్రతల గురు - యతుల సతులను
మతిని గోరిన - దురిత మెల్లను

పాతకములగు యీ - బ్రహ్మ గుండము
నందు మునుఁగఁ. ౬

కావుసను స - ర్పమును గళమున
నీవు జుట్టుక - నీట మునిగిన
బోవు నురగా-కారమును నగు
భావజుడనఁ. ౭

రూపు రేఖ వి - లాసముల నిల
రూఢి కెక్కను - తేజ మలరఁగ
భూపతై సా - మ్రాజ్య మేలును
తాప మేలా? ౮

నిత్య వైభవ - ములను బొందెదు
నిశ్చయంబుగ - నీకు పతియగు
సత్య మిదియని - గగన వాణీ
సరణి బలికెఁ. ౯

వ. ఇట్లు ఆకాశవాణి బలికిన విని,

గీ. మదిని సంతసమంది యా - మగువ బ్రహ్మ
గుండమున బడమాని యా - కుండలీశు
నెత్తి గళమున జుట్టుక - నీటిలోన
మునుఁగ వాసన గల - పూల ముసురు గురిసె.

వ. అంత.

జంపె.

పాము రూపము బాసి - ఏమి జెప్పగ వచ్చు
భామ సరసను మధన - కాముడన నలరెన్ ౧
సుర గురుని వాక్శుద్ధి - సూర్యకాంతియు కనక
గిరిధీర తమృతాంశు - కీడగు ముఖంబున్. ౨
కలువరేకులబోలు - కన్నులును తియ్యవిల్
చెలువు నను కను బొమలు - శ్రీలనగ చెవులున్. ౩
తేటి రెక్కల బోలు - దీటు మీసంబులును
శోకేరు ముక్కబ్జ - సాటి దంతములూ ౪
అంబుజ లతలఁబోలు - ఆజాను బాహువులు
కంబు కంఠం బరుణ - కమలమన పదముల్. ౫
ఎగుబుజము నగుముఖము - తగిన భూషణములును
చిగురు వెన్నెలబోలు - చీనాంభరంబుల్. ౬
గలిగి చక్కదనంబు - గల పురుషుడై నిలువ
అలివేణి జూచితా - నాశ్చర్య మందీ. ౭
అచట తపసులు బలికి - నామాట లెల్ల నేఁ
డిచట నిజమయ్యె నిక - నిల యేల గలఁడూ. ౮
అని నిశ్చయించి తా-నానందమున బొంది
తన నాధునకు మ్రొక్కి - తరుణి యపుడనియెన్. ౯

వ, ఇట్లు సకల పాప సంహారిణియైన బ్రహ్మగుండంబున ము
నింగినంత సర్పాకారంబు బాసి శంబరాంతకు సరియై

సౌందర్యంబులు గలిగి నిలిచిన తన జీవితేశునిం గని
మదనలాహిరినొంది దండంబుబెట్టి త్రైలోక్యసుందరి.

సీ. కనకాద్రి సమధైర్య ॥ వననిధి గాంభీర్య
మనసిజ సౌందర్య ॥ వినుత శౌర్య
కర్మదూర పవిత్ర ॥ నిర్మల చారిత్ర
ధర్మాంగదు సుపుత్ర ॥ దాన పాత్ర
నేను నీ దాన నా ॥ మానము నీసొమ్ము
గావున జేబట్టి ॥ బ్రోవు నన్ను
నిను కనుల జూడగా ॥ మనసిజుడు నను డాసె
మదనాగ్ని చే నింక ॥ మనగ జాల

గీ. తియ్య విల్తుని బారికి ॥ తోయ వలదు.
నేను నోఁచిన నోమెల్ల ॥ నేటి కిపుడు
ఏ కొదవ లేక చేకూడె ॥ రా కుమార
నన్ను రక్షించు నాప్రాణ ॥ నాథ యనినా.

వ. అప్పుడు త్రైలోక్యసుందరినిం గని యతండు.

త్రిపుట.

వనిత విను నను - తనయుడని గను
జనని జనకులు యెవరు - మును నిను
కనియు వినినది లేదు - నను మగ
డనగ దగునే.

తరుణి నీ తలి-దండ్రు లెవ్వరు

ఎరుగ మన మిరు - వురకు నెవ్వరు
పరిణయం బొన - రించి రెన్నడు
వరుస తోడన. ౨

చెలియ మును మన - మరల యిరువురు
కలసి మెలగితి మే - నిలయమున
కలికి నీతో - పలుక నెగుగ నె
కలలో నైనన. ౩

పతియు నీకెటు - లగుదు నే నా
సతియెటుల నై - తిట కెపుడు వ
చ్చితిమి వన దే - వతయొ జల దే
వతయొ రతియో, ౪

శివుని సతొ శ్రీ - సతివొ భారతొ
అవని సతొ ఆ - కాశ వాణివొ
యెవరొ నీవిధ - మెరుగ బలుకుము
వివరముగనూ. ౫

వ. ఇట్లు బలికిన పురుషునిం గని నారీమణి.

ద్విపద.

భారతి నే గాను - పార్వతి గాను
ఆ రమా సతి గాను - అవని సతి గాను
వన దేవ తా కాశ - వాణి నే గాను
వినుము రత్నాంగద - విభు పుత్రి నేను

నీ వర్తమానంబు - నేను జెప్పెదను
అవనీశ పుత్రి నీ - వాలించి వినుము
తెరగొప్ప కాశ్మీర - దేశంబు నందు
ధరణీశుడైన యా - ధర్మాంగదునకు

సతియైన గుణవతికి - సర్పమై నీవు
సుతుడుగా బుట్టితివి - సుందరాకార
ధరపతి నిను జూచి - తలపోసి యప్పుడు
ధరణీ సురుల బిలచి - తనయు జాతకము

జెప్పుమన్నను వారు - జాతక మరసి
జెప్పిరి కొన్నాళ్లు - జరిగిన వెనుక
పుడమెల్ల యేలునన - బుద్ధిమతిమంత్రి
తడయక నందుకు - తగుయోచ నెంచి

పుడమీశునకు బుట్టె - పుత్రుడటంచు
జడియక జగమెల్ల - చాటించి నన్ను
పట్టపాయుధమునకు - పరిణయము జేసి
నెట్టన గొనిపోయి - నీమగ డనుచు

పుట్టు బోగిని జూప - పొక్కుచు నేను
పెట్టెతో నిన్ను తల-బెట్టుక నదులు
గిరు లడవు లాశ్రమముల్ - ధరలోన గలుగు
తిరుపతు లెల్లను - తిరిగి యిచ్చటికి

వచ్చి దుఃఖం బంది - వనటులం బొంది
యిచ్చ చింతించి యా - నీట బడబోగ

అశరీరి సర్పము - నరుత జుట్టుకొని
శశిముఖి యీ నీట - స్నానంబు జేయు

పురుషుడగు నని బలుక - పొలుపొంది నిన్ను
అరుత జుట్టుకొని యీ - సరసిలో మునుగ
నిన్ను మనిషినిగా - నిర్మించె బ్రహ్మ
నన్నేలుకో దగు - నా ప్రాణనాథ

అని విన్నవించిన - అద్భుతం బంది
వనిత మహాపతి - వ్రత యని మెచ్చి
కడుసంతసించి య - క్కడ నుండునంత
పుడమిసురు లచటికి - భోరున వచ్చి

దంపతులను జూచి - తగను దీవించి
ఇంపుగా దానంబు - లిమ్మనువారు
గజదాన మిమ్మని - కాంక్షించువారు
రజత మిమ్మనుమహా - రాజను వారు

కనక మిమ్మని మది - కామించువారు
ధనము లిమ్మను మహా - దా తనువారు
హయదాన మిమ్మని - ఆశించువారు
జయమగు మీకని - చేలమనువారు

ఫలదాన మిమ్మని - పలికెడువారు
తిలదాన మిమ్మని - దీవించువారు

భూరిదానము లిమ్మ - భూపతనువారు
ఈరీతి దానంబు - లిలనురు లడుగ

వనితయు నవమణి - వరభూషణములు
తన కక్షపాలలో - దాఁచియున్నట్టి

మెచ్చైన సొమ్ములు - ఇచ్చివారలకు
అచ్చుగా దంపతు - లంజలి జేసి

నునిచి వారల నపుడు - వనజాయతాక్షి
కనుగొని ఒకమాట - వినుడని బలికె.

వ. ఈప్రకారంబున ధరణీసురోత్తములకు దానంబు లొసంగి నవ్విప్రులతో త్రైలోక్యసుందరి.

త్రిపుట.

బ్రహ్మాండమ - హాత్మ్య మింతని
పలుక ఫలములు - నిర్ణయింపగ
బ్రహ్మరుద్రా - దులకు శక్యమె
బ్రాహ్మలారా. ౧

మూఁడులోకం - బులను ముప్పది
మూఁడు కోటర - తీర్థములు గల
దీడులేదీ - తీర్థమున కే
జాడ జూడఁగ. ౨

కలుషమను కుల - శైలములకును

కులిశమగు యీ - బ్రహ్మగుండము
బలు భవములను - మేఘములకును
పవన మగుసా. 3

దండశూకము - తోడ నేనిపు
డిందు వచ్చి - బ్రహ్మగుండము
నందు మునుగగ - నరునిగా నిం
పొంద జేసీ. ౪

వరునిగా నా - కొనర జేసియు
దురిత మెల్లను - పరిహరించెను
ధరణి సురలా - రనియు వారికి
దండమిడగా. ౫

వ. అని తన తెఱంగెల్లయుం జెప్పి దండంబు బెట్టిన త్రైలో
క్యసుందరినిం గని యవ్విప్రులు.

జంపె.

పంచమాతలను కా - మించుపాపంబులును
పంచపాతక మెల్ల - ద్రుంచు యీ సరసీ. ౧
బ్రహ్మహత్య మొదలుగా - బహుపాపములు ద్రుంచ
బ్రహ్మగుండంబనగ - బరగె నిదివరకుఁ. ౨
శేషుడే మానవ వి - శేషుడయ్యెను యికను
శేష గుండంబనగ - జగతిలో వెలయుఁ. 3

అతివరో సత్యవతి - పతివ్రతవు నీవు నిను
మతి దలంచినవారి - కతములగు భవముల్. ౪

ఇందీవరాక్షి యీ - దండ శోకపు మహువు
నందు దోగినవారు - జెంద రెమబాధల్ ౫

వ. ఇట్లు బలికి నవ్విప్రులుం జనిన త్రైలోక్యసుందరి భర్తస మేతంబుగా మగుడి నరహరి సన్నిధానంబునకు వచ్చి సాష్టాంగదండంబు లాచరించి స్తుతియించి.

లయహరి.

నరహరి ద - శరధ సుత
మురహరి గ - రుడ గమన
పరమ పద - నిలయ హరి
శరణదితి - రక్ష. ౧

సురవినుత - కరివరద
తరిగిరి ధ - రసుర హర
మరుజనక - నరుని సఖ
శరణు ముని - పక్ష. ౨

సరసిజ భ - వుని జనక
సురపతి త - నయ హరణ
తరణి కళ - నిధి నయన
శరణు మణి - వక్ష. 3

శిరిరమణ - కరిమథన

ధరవరు పు - రహరు సఖ
కరుణ శర - ది మదురిపు
శరణు శిరి - వక్ష. ౪

౯. అని వినుతించి.

## మంగళము

మంగళం మంగళం ॥ శ్రీనరహరీ
మంగళం మంగళం ॥ భవంతు తే
మంగళం మంగళం. ౧

ఇందిర హృదయూర ॥ విందమిళింద పు
రందర వందిత ॥ ఇందు నిభా
మందర ధర సుర ॥ వందిత సనక స
నందనార్చిత గో ॥ విందముకుందా
మంగళం మంగళం ॥ శ్రీనరహరీ
మంగళం మంగళం ॥ భవంతు తే
మంగళం మంగళం. ౨

అక్షణమున హిర ॥ ణ్యాక్షుని వధియించి
ఈక్షితి బ్రోచిన ॥ లక్ష్మీపతి
పక్షివాహన పా ॥ లాక్షవినుత భక్త
రక్ష శ్రీ కౌస్తుభ ॥ వక్ష కంజాక్ష
మంగళం మంగళం ॥ శ్రీనరహరీ
మంగళం మంగళం ॥ భవంతు తే
మంగళం మంగళం. 3

నరులెల్ల నానంద ॥ కరముగాను మిము
మురహారివని చాల ॥ మొరలిడగా
ధరణిలోన ధర్మ ॥ పురమున నెలకొని
సిరు లిచ్చి దాసుల ॥ కరుణించు శ్రీహరీ
మంగళం మంగళం ॥ శ్రీనరహరీ
మంగళం మంగళం ॥ భవంతు తే
మంగళం మంగళం. ౪

వ. మఱిన్ని విన్నవించి

జంపె.

ఆపదోద్ధారకా - ఆర్తజన మందార
పాపనాశ నృసింహ - భక్తవాత్సల్యా. ౧
ఉరగరూపము బాపి - నరుని జేసియు నాకు
పురుషునిగ జేసితివి - ధర ప్రసిద్ధిగనూ. ౨
శరణన్న నాథులను - కరుణించి రక్షించు
బిరుదు నీదేగాని - ఒరులకును గలదే. ౩
అనుచు బహువిధములను - అభినుతులు జేసెఱగి
తన నాథు నెనసందు - దశరాత్రులుండీ. ౪
పరమాతి శయమునను - వరునితో నరిగె నం
బెరుమాళ్ల సన్నిధికి - గరుడాళువార్లకు. ౫
పన్నిద్దరాళ్వార్ల - పరమభాగవతులను
సన్నుతించియు స్వామి - సన్నిధికిబోయీ. ౬
రంగపతి కెఱగి తీ - ర్థప్రసాదములు గొని
అంగనయు వసియించె - నచట పదిదినముల్. ౭

ఉండి స్వామిసన్నిధిని.

దంట శోభనము.

రంగా కస్తురిరంగా ♦ రంగఖగతు రంగసుజన
సంగకలుష భంగహారే
రంగాకస్తురిరంగా ♦ రంగగుమణి నీలాంగా
అంగజజన కఖిలాంగా
రంగా శ్రీహరి రంగా ♦ శోభనమే. ౧

మత్స్యావతారమవై ♦ తుచ్ఛులవెద ముచ్ఛులసింధు
జొచ్చిన నచ్చి కుచ్చితులన్
మత్స్యావతారమవై ♦ గుచ్చియు మెచ్చగుచదువుల్
తెచ్చియు నుతుగని మెచ్చియు
ఇచ్చిన అచ్యుతునకునూ ♦ శోభనమే. ౨

సుందరమగు కమఠమవై ♦ వందితసుర బృందములకు
ఇందని సుధ నందొసగన్
సుందరమగు కమఠమవై ♦ మందరమహి బంధించీ
ఇందని సింధువు దరచీ
అందిచ్చు ముకుందునకూ ♦ శోభనమే. 3

ఘన వరహావతారమవై ♦ కనకనయను గొని చనుధర
గనివాని తనుదునుముటకై
ఘన వరహావతారమవై ♦ సనకాదులు నుతియించా
కనకాక్షుని వధియించీ
మనిచిన ధర మురహారికీ ♦ శోభనమే. ౪

నరసింహావతారమవై ♦ హిరణ్యాకశిపు హరిహాతు లజు
సురు లిలసరి నొరులనిన్
నరసింహావతారమవై ♦ బరువడి గోళ్లను జీరీ
వరభక్తుని ప్రహ్లాదుని
కరుణతో గాచిన హరికీ ♦ శోభనమే. ౫

కడుచిన్ని వడుగడవై ♦ కడుభయమున పడతియు వజ్రి
యడవులబడు ♦ యిడుములకై
కడుచిన్ని వడుగడవై ♦ పుడమియు వేడియు బలినీ
జడియకగొని రసతలమున
నడగగ ద్రొక్కిన హరికీ ♦ శోభనమే. ౬

పరశురామవతారమవై ♦ దురమున బహు ధర పతులను
సిరములు తెగ నరికితివో
పరశురామవతారమవై ♦ బలుడౌ అర్జును జంపీ
ధర నెల్లయు కశ్యపునకు
దా రిచ్చిన శ్రీహరికీ ♦ శోభనమే. ౭

దశరధసుతు రాముడవై ♦ కౌశికుకృప నిశితాస్త్రము
లసురులగొట్టి పశుపతి విల్
దశరధసుతు రాముడవై ♦ అసహాయుడవై! విరిచీ
శశిముఖి గొని దశకంఠుని
మసిజేసిన రఘుపతికీ ♦ శోభనమే. ౮

గోపాలకృష్ణుడవై ♦ గోపసతుల రాపులతరి
తీపుల బహు ప్రాపకమై

గోపాలకృష్ణుడవై ♦ బాపియు ధనుజుల బుధులఁ
కాపాడియు భూభారము
బాపిన గోపాలునకూ ♦ శోభనమే. ౯

బుద్ధావతారమవై ♦ బద్ధముగల వృద్ధసురుల
ముద్దియలతో నొద్దికవై
బుద్ధావతారమవై ♦ బుద్ధియుగల ముద్దియలఁ
సిద్ధిగ సిర సురమున మే
నెత్తి ధరించిన హరికీ ♦ శోభనమే. ౧౦

కలికై గుఱ్ఱము నెక్కి ♦ కలినిగెలిచి కలియుగమున
కలులను శుభ ఫల మొసగఁ
కలికై గుఱ్ఱము నెక్కి ♦ ఇలభారము దూలించీ
జలజజు రఘుపతిచే పూ
జలుగొను రంగశాయికినీ ♦ శోభనమే. ౧౧

ఇట్లు త్రైలోక్యసుందరి తన జీవితేశునింగూడి శ్రీరంగంబు నకు వచ్చి శ్రీరంగనాయకుల మహోత్సవముల దర్శనంబు జేసికొనుచు పదిదివసంబు లుండి తన పుట్టినింటికిం బట్టయిన మాణిక్యపట్టణంబునకుఁ బోదలంచి వరునితోగూడి నరుగునప్పుడు త్రైలోక్యసుందరి తనలోతాను-

జంపె.

పాము మగడని యెరుగు - నీమెల్ల యిపుడు నా
సామితో బోవ నను - భూమేమటనునో. ౧

మతిని సందేహించు - మాట లాడ వెను పాము
పతియగది దనృతమని - కుతల మెల్లనునో ౨

జననీజనకులు నను - మనుపుదురో మనుపరో
జను లెదుర నొకటి మరు - గున నొకటనుదురో. 3

అల్లగా కివియు ధ - ర్మాంగదున కెల్లనిన
కల్లలనునో యేమి - వల్లడి బరచునో. ౪

కనకపురమునకు జను - టనువు గాదనియు తన
జనకుపీటికి నరిగె - పెనిమిటితో నెనసి. ౫

వ. ఇట్లు తన మనోహరునింగూడి త్రైలోక్యసుందరి మాణిక్య పట్టణ రాజమార్గంబున వచ్చునప్పుడు.

త్రిపుట.

బుధులు మంత్రి పు - రోహితాస్యులు
భూపతులు పం - డితులు విప్రులు
రధికులును మహా - రధులు సమరధు
లర్ధ రధులూ. ౧

సకల పరివా - రములు గొలువగ
జనపతియు ర - త్నాంగదుండును
ప్రకటముగ బహు - వైభవములతొ
భద్రపీటక. ౨

నాకమున సుర - వరులతో ము
లోకనాయకు - రీతినుండెను

లోకములు విను - తించగా పే
రోలగమునా. 3

ఆతరెతి వే - సమున పతితో
కూఁతు వీ ధే - తేరగా గని
భూతలేశుడు - మది తహతబడి
పొక్కు లేచీ. ४

ఎదురుగా చను - దెంచి యిరువురు
గదిసి కౌఁగిట - జేర్చి శోకము
గదుర కన్నుల - నీరు గారగ
పదరి బలికెా. ౫

రీతిమాలిన - రూపుతో నీ
వే తెఱగు కా - ల్నడల యిగువురై
కూఁతురా రా - నేమి నీకే
కొరత లొదవెా. ౬

పట్టభద్రుని - పట్టికిని ప
ట్టంపు బారిగ - నిన్ను కత్తికి
గట్టి బంపగ-మెట్టి నిందెలు
బెట్టినారో ౭

అడవిభద్రుల-జడియ కిరువురు
నడచి యెటు వ - చ్చితిరె కూఁతుర

బడలియిటు రా - నేమి అరడి
బొడమె తనయా. ౮

ఏమివల్లడి - బుట్టె కూఁతుర
ఏదినీమగ - డితడెవడు నీ
కేమి యాపద - వచ్చెనాసుత
యెరుగ బలుకూ. ౯

వ॥ అని అడిగిన త్రైలోక్యసుందరి తంద్రినిం జూచి,

జంపె.

అయ్యానీ కడుపునే - నాడఁబిడ్డగ బుట్టి
యెయ్యెడ లెవరు బడని - యిడుములును బడితీ. ౧
వినవయ్య కనకపురి - జనపతికి మొదటికిని
తనయుడే లే డతని - ధర్మ పత్నికినీ. ౨
పాము బుట్టగమంత్రి - భూమేలుపతికి తా
నేమేమొ బోధించి - పామనక జగతిణ. ౩
పుడమీశునకు బుట్టె - కొడు కనుచు పుడమెరుగ
బడజేసి భూమీశు - కొడుకితడ టనియుణ. ౪
తనసుతుని జూఁపతఁడు - మనయింటి కేతెంచి
నిను అటమటలుజేసి - నను పెండ్లిజేసి. ౫
తోడుకొని బోయి నను - వేడుకలరగ జెనుప
కోడలని వారినే - గొలిచి వర్తింపా. ౬

జాడవాడల మగని - జూడబడ గానమని
తోడి చేడెలను నతఁ - డేడని యడుగగా. ౭

వ. అని మఱియు,

ద్విపద.

వినుము రత్నాంగదో - ర్వీశయా చెలులు
తనయుని గన్నట్టి - జనని నడుగు మన
చని అత్తకె ఱగి నీ - తనయు డే డఁతని
పెనిమి టితఁడని నేను - కనుల గననుగదె.
నామనోనాథుని - నాకు జూఁపుమని
భామామణిని నేను - ప్రార్థించి యడుగ.
ఎట్టికర్మములు మును - యేను జేసితినొ
పట్టిగా కడుపున - బుట్టె నొకపాము
పామనక బాలుఁడని - భూమెరుగ జేసి
రామ నిను తేగనొక - గాల్మోట గట్టి
కట్టడి మంత్రింత - రట్టుబెట్టె నని
పుట్టుబోగిని దెచ్చి - పెట్టెలో నిచ్చె
ఇచ్చిన ఆపద - ల్వచ్చెగా యనుచు
ఇచ్ఛ చింతించి నే - యతివేసమేసి
ఆశలు నేరుతో - కోసి పారేసి
దేశమునగల దివ్య - తిరుపతులు నదులు
జూచి వచ్చెద నని - బూచి నెత్తుకొని
మోసుక తిరిగి తీ - దే శమెల్లెడల

బడలియు కడపట - బ్రహ్మగుండమను
మడువున బడి వుసురు - మాపుకొందనుచు
ఉరకబోవగ నప్పు - డొక రశరీరి
ఉరక వలదీవేళ - వురగంబునొకటి
గొంతుననిడి బ్రహ్మ - గుండమున మునుగ
కాంతుడౌ నీకు యీ - కాకోదరంబు!
ధరపతి యగునని - తథ్యమని బలుక
ఉరగంబుతోడనా - వోజనే మునుగ
నాగేంద్రు డప్పుడు - నరరూపు గలిగి
నాగేంద్రుశయనుకృప - నా సరస నిలిచె
నతడే యితడు జూడు - కుత లేశ నేను
ఇతని దోడ్కొని యిప్పు - డిందు వచ్చితిని
అన విని యారాజు - అతి దుఃఖమంది
తనయు నీవిట్టి తా - పంబులం బొంద
కననేర నొకమాట - విననేరనైతి
ననియుని దుఃఖంచి - యవనీశు డనియె.

వ. ఇట్లు త్రైలోక్యసుందరి తన వృత్తాంతం బంతయు దం డ్రికిం జెప్పగా విని తాపంబునొంది రత్నాంగదుండు.

జంపె.

ధర్మాంగదుడు సత్య - ధనుడ నెంచితిగదా
ధర్మదూరుండిట్టి - కర్మియని యెరుగా. 1

మొదటికిని తనకు గోడు - కుదయమే లేదె యీ
ముదిత నెటువలె పాము-కదయుడై గట్టెరా. 2

కట్టి పామును పెట్టె - బెట్టి తల గట్టకవి
కిట్టి రట్టిడి దరుమ - నెట్టికట్టెదో. 3

పరవారి బిడ్డనీ - పాటు బరచితెవారు
యెరిగితేమ నుదురను - ఎరుకింత లేకా. 4

జనపతియు వలదనిన - సచివు డీగతి జేయ
మనుపదగ దతనితల - దునుమగావలయూ. 5

ఇంత కెంచినవా డీ - కెంతటికి యెంచడక
టింత ద్రోహనియు నిసు - మంతెరుగనైతిరా. 6

అనిదూరి వ్యసనమున - తనయనల్లునితోడు
గొని నగరికే తేర - తన దేవియపుడూ. 7

వ. ఇట్లు రత్నాంగదుండు కూఁతురిని అల్లునిం దోడ్కొని త
న నగరికివచ్చిన త్రైలోక్యసుందరిని అత్యంతశోకంబునం
కౌఁగిటంజేర్చి తల్లియైన శుచిరాంగి యేమని ప్రలాపింపు
చున్నదీ.

అటతాళము.

నాతనయ త్రై - లోక్యసుందరి
నాదు ముద్దూ - కూఁతుర
ఏతరిచటికి - ఒంటిగా
నే తెంచితమ్మా. ౧

పువ్వులమ్మిన - అంగడింటను
పుల్లలమ్మా - రీతిని
ఇవ్విధియు యె - వ్విధము వచ్చెనె
పువ్వుబోణి. ౨

మణుల సొమ్ములు - జీని చీనాం
బరము లేదే - తామర
మణుల పేరులు - జడలు కావులు
మనుప నేలే. ౩

తల్లిరో త్రై - లోక్యసుందరి
ధవుడు నీవ్రా - రానే
వల్లడాయనె - యనినజనని
కెల్లనిన వినియుణ్. ౪

ఎక్కువగనా - యింటబుట్టి
తక్కువలనూ - బొందితి
వక్కటా నా - కూంతురాయని
వెక్కివేడ్చెణ్. ౫

భోగినెత్తుక - జోగివై నీ
వేగతిగనూ - వేగితో
భోగమెల్లే - నీటగలపితి
వే కుమారీ ౬

పడతులతో శృం - గారవనమున
నడచి యాడా - నీతను

బడలుగద అడ - విడుము లెటువలె
బడితో వబలా ౭

ఈడు వారలు - జోడుబాయక
గూడి మగనీ - తోడను
వేడుకలరగ - బ్రతుక నీకీ
గోడు గలిగెగ ౮

ఎంత బడలితో - ఎంత తల్లడి
తెంతగోడూ - గుడిచితో
ఇంతి నీ తం - డ్రేను యెరుగమె
సుంతనైనగ. ౯

వ. అని తల్లిశోకించగా నంతఃపురజనులు ఘోయని రోదనం బుజేయ వారల నివారించి రత్నాంగదుండు పుత్రినిం జూచి.

జంపె.

చింతయేఁటికి నీకు - సంతసింపుము నాదు
చెంత నుండుము తనయ - వంత గుందకికగ. ౧
అంగజుని జనకు శ్రీ - రంగనాథుని కృపను
భంగమొక్కటిలేక - యింగితంబుగనూ. ౨
ఇచ్చటికి వచ్చితిది - యొక్కటే చాలు నా
కిచ్చితివి ఘనత కీ - ర్తిచ్చ దెచ్చితివీ. 3
అనికూఁతు వెయినోళ్ళ - కతిశయముగా బొగడి
మనమలర స్నానంబు - లొనర జేయించీ. ౪

కనకాంబరంబులును - కనకమణిహారములు
తనయకల్లునికి దవ - నములు మరువములూ. ౫
విరువాజులును జాజి - విరులు గంధములొసగ
ధరియించి రిరువురును - పరమహర్షమునా ౬
ఇరువురొక నగరిలో - విరుల శయ్యను వేట్క
మరుకేళిలో దేలి - రరుష ముప్పొంగగా. ౭

వ. ఇట్లు త్రైలోక్యసుందరి తన ప్రాణనాధునింగూడి సంతో షాతిశయంబులం దేలి సరససల్లాపంబులం గొన్ని దినంబు లుం జనిన పిమ్మట అత్తగారింటికిం బోవదలంచి త్రైలో క్యసుందరి తండ్రినింగని.

సీ. అయ్య నేనన్నాళ్లు ॥ యిట్టుండిన గాని
అయ్య నాకొక అర ॥ మరిక లేదు
అత్తమామలజూడ ॥ ఆశబుట్టె గదయ్య
నాకున్న వారెట్టి ॥ శోకమునను
బడుధురో వృద్ధులు ॥ పరమపుణ్యులువారు
వూరక యేమిందు ॥ వుండనేల
రాజ్యాంగమునకును ॥ పూజ్యుని జేసి భూ
మెల్ల యేలింపు నీ ॥ యల్లునిపుడు

గీ. పయనమొనరించు చతురంగ ॥ బలమునెల్ల
పిలువనంపుము పోవలె ॥ భీకరముగ
నందరును గలుగ వొంటిగే ॥ నందునరుగ
నీతిగాదీవు వెడలుము ॥ భూతలేంద్రా.

వ. అని యిట్లు బలికిన త్రైలోక్యసుందరి వచనంబులు విని యియ్యకొని చతురంగబలంబుల జతనంబు జేయించి.

ఝ ం పె.

తనపుత్రినపుడు మది-మెచ్చి ? మెప్పుగను
కనకమణిహారములు - ఇచ్చి. ౧

అల్లునతి వేగమున - బిలచి ? అతని
వుల్లమలరగ పూజ- జేసి. ౨

పదినూరు వేల తుర - గములూ ? అల్లునికి
పదినూరు వేల యే - నుగలూ. 3

పదినూరు వేల పశు - వులునూ ? అరణముగ
పదినూరు వేల రథ - ములునూ. ౪

ఇచ్చె జీనాంబరం - బులునూ ? మణుల
హెచ్చైన భూషణం - బులునూ. ౫

లక్ష దాసీజనం - బులునూ ? ఇచ్చి
అక్షణంబున అతిర - థులనూ. ౬

సమరథుల మహారథుల - దొరలా ? కాల్బ
లముల చతురంగ సై - న్యములా. ౭

జతనంబు జేయించి - సకలా ? జనులు
అధిక మోదంబునను - వెడలా. ౮

అల్లుకొక రథము నె - క్కించెో ? సుతయు
తల్లి పదములకు సే - వించెో. ౯

తనయ నె త్తియును దీ - వించీ ? తల్లి
కనక పల్లిక యందు - వుంచీ. ౧౦

పంపించె అనురాగ - మెసగా ? తండ్రి
యింపొంది రథ మెక్కి - రాగా. ౧౧

భేరీ మృదంగ వా - ద్యములూ? మ్రోయ
బూరుగలు నాగసా - రములూ. ౧౨

వంది మాగధులు స - త్కవులూ? బుధులు
సందడింపంగ సై - న్యములూ. ౧౩

ఎల్లెడలతను గొల్చి - రాగా? అల్లునితో
సల్లాప గోష్ఠితో - జరుగా. ౧౪

బ్రహ్మాండమవియు సై - న్యములూ? అధిక
గహ్వారంబున వెడలి - రపుడూ. ౧౫

వ. ఇట్లు రత్నాంగదుండు చతురంగబల సమేతంబుగా అల్లునిం గూతురినిం దోడ్కొని జనుచుండ.

జంపె.

గిరులు వన ములు నదులు - పురములును దేశములు
తరలె చతురంగములు - బిరుదు రవములతో. ౧

తురగ హేషములతో - తూర్య ఘోషములతో
కరిబృంహితముల ఘీం - కార రవములతో. ౨

వీరహుంకార శం - ఖారవంబులతో జయ
భేరీ రవంబులతో - నీరదియు బోలుచు. 3

గుండెలును బగులంగ - సింహనాదముల బ్ర
హ్మాండమల్లాడంగ - హారులు బెదరంగా. ४

ఈతరిని కనకపురి - ప్రాంత్యమున కరుగగా
ఆతరిని కనకపుర - మాద్యంత మదరెను. ५

వ. ఇట్లు రత్నాంగదుండు చతురంగబలసమేతంబుగా కన
కాపురంబున కేతేర నప్పట్టణంబునంగల కాంతా జనం
బులు భీతిజెంది దుఃఖావేశులై.

ఏ క తా ళ ం.

తల్లులు బిడ్డలు - ఎల్ల జనంబులు
ఉల్లము జదరల్ల - కల్లోలముగా. ౧

కొందరు సందుల - గొందుల దూరిరి
కొందరు బారిరి - కొందరు బెదరీ. ౨

తల్లడిల్లుచు వచ్చి - ధర్మాంగదు గని
ఘొల్లని మొరయిడి - రెల్ల జనంబుల్. 3

పర రాజెవ్వడో - బలముతో యిటువచ్చి
పురి ముట్టిడి వే - సిరి నేడనిరి. ४

అదరి తత్తరబడి - హయరథ గజముల
చెదరక దళముల - సేఖర బరచీ. ५

గవినిక్రొవ్వైవై - గజముల నిలిపియు
అవిరళముగ నడ - వల వైవేలూ. ౬
కొత్తళమున కొక్క - కోటి బటులనిడి
సత్తుగ దళముల - మొత్తము జేసి. ౭
యుద్ధమునకు స - న్నద్ధుండై యుద్ధ
మొద్దిక బడదని - బుద్ధినిఁ దలఁచి. ౮
ఇవ్వడువున యి - య్యెడ కేతెంచుట
యెవ్వడొగా నత - నెరుగగ వలయుఁ. ౯

వ. అని విచారించి ధర్మాంగదుండు చతురోపాయజ్ఞులైన ప్రౌఢుల నతిత్వరితంబున రావించి వారలతో.

సీ. పుడమిాశు డెవడొకొఁడు ౕ జడియక చతురంగ
బలముతో వచ్చిన ౕ యిలప తెవడొ
తలగక మిారేఁగి ౕ ధరపతి గనిమాట
లాడి యారాజు యే ౕ నాడు యేలు
ఇప్పుడెచటికి జనెద ౕ రిచ్చటి కేతేర
ఏమి కారణమని ౕ యెరిగి రండు
పొండన్న వారేగి ౕ భూపతి గని మ్రొక్కి
దేవర వారిదే ౕ దేశమునికి

గీ. ఎందు జనియెదరిపుడు మిా ౕ రిందు వచ్చు
టేమి కారణ మెవరు మిా ౕ పేరు ఊరు
తెలసి రమ్మని కాశ్మీర ౕ దేశమేలు
పతియు మము బంపె వివరింపు ౕ పార్థివేంద్రా.

అనిన విని నవ్వి రత్నాంగదుండు వారలంజూచి.

జంపె.

చయ్యనను వినుడి మీ - జననాయకున కేను
వియ్యంకుడను గాని - వేరొకడు గాదూ. ౧
పొలుపొంద మాణిక్య - పురవరంబుననుండి
చెలువొంద యిచటికే - వలసి వచ్చితినీ. ౨
పెండ్లి జేసియు నేను - బిడనంపి ఇన్నాళ్లు
కండ్ల జూడగ నిందు - కదలి రాలేదూ. ౩
ఈ ప్రొద్దునా పుత్రి - నేపార జూడనా
కాపేక్ష గలిగిఅ - ల్లుని జూడగోరీ. ౪
పొందుగా బావనిం - దుండువిందుల జూడ
యిందు వచ్చితి పతికి - సందేహమేలా? ౫
వెఱవకిందాకతని - నరుగుదెమ్మనుడు మీ
రరుగుడన వారు మది-మరిగి వేగరిగీ. ౬
జనపతిని గని మ్రొక్కి-వినుమనంతయు దెలుప
వినియు ధర్మాంగదుడు-మనమెల్ల కలగీ. ౭

అప్పలుకులన్నియు విని ధర్మాంగదుండు.

ద్విపద.

వచ్చె ప్రళయము మంత్రి - ముచ్చు తంటలను
తుచ్ఛ పనులును జేసి - తెచ్చె పెదచిచ్చు

తనయు నాయిలు విడిచి - వనము కేగుటయు
వినిగదా మనమున - కనలి కోపించి
దంతి రథాశ్వప - దాతితో గూడి
రంతుకై వచ్చెగా - రత్నాంగదుండు
పట్టభద్రుని సుతను - పుట్టుబోగికిని
కట్టవద్దన్న యీ - కట్టడి మంత్రి
పట్టపు కత్తికి - గట్టి యిటు దెచ్చి
వట్టి పిడుగులు దెచ్చి - బెట్టెనే నేడు
అల్లుని కూఁతురి - నంపించుమనిన
చెల్లబో నేనేమి - జెప్పుదాజనికి
పడుచున్నదనిన తో - డుక రమ్మటనుచె
పడుచు లేదన తొడరి - గడుసు లేమనుచొ
బాపలాడిన శాస్త్రి - పలుకు నిజమనియు
పాప లక్షణములు - ఫలితమా యనియు
పెంపొంద యిటుజేయు - భువిని నాతలయు
వంపులు జేసిరి - వసుదామరులును
జాతక ఫలము దప్పె - శాస్త్రంబు దప్పె
నాతి లక్షణములు - నన్నియుం దప్పె.
రంగ పతంగ తు - రంగ భవ భంగ
అంగజ జనక భు - జంగ పర్యంక
ఏమి జేయుదు నేను - యేమని జెపుదు
ఏమని బొంకుదు - యెందు దూరుదును
అనియని చింతించి - యవని వల్లభుఁడు

మనమున కోపించి - మంత్రినింజూచి
ఓదుష్టమతి నేను - వద్దనగ నీవు
ఈ దుర్దెశలు, దెస్తి - వింట నేనుండ
ముంగలికీడ్చిన - స్నంగడింబెట్టి
భంగంబు దెస్తివే - పాపాత్మ యిపుడు
బద్ధంబు దప్పియు - సబద్ధంబులాడి
ముద్దియం దెచ్చుటిది - వద్దంచు నేను
జెప్పిన వినవైతి - వప్పుడు నీవు
ఇప్పుడేమని జెప్పు - దప్పడమి పతికి
అనితన్ను దూషించు - నారాజుజూచి
వినుమని సచివుండు - వినుపించెనపుడు.

వ. ఇట్లు విలపించు ధర్మాంగదునింజూచి బుద్ధిమతిమంత్రి అత్తరికిందగు ఉచితోక్తుండై.

జంపె.

ధరణీశ నీకింత - తాపమే లీవేళ
ధరను పర్వాలపలుకు - తథ్యమగుగానీ. ౧
మేరు తలక్రిందైన - దారుణి రజంబైన
నీరదింకిన శాస్త్రి - మేర పొల్లగునే. ౨
తెల్లబడివను జలము - చల్లనైనను అగ్ని
పొల్లగున శాస్త్రింబు - కల్లలై తవనిఁ. 3
రవి విదులు తార లుద - యము లస్తమానములు
భువి యాకసము సురలు - పొల్లు గావలెనే. ౪

మదిని చింతిలకు మన-విధివశము విడదిపుడు
మదన జనకుని కరుణ - నొదవు మోదంబుల్. 26

వ, అని బుద్ధిమతిమంత్రి ధర్మాంగదుని తాపంబు వలదని నివారించి జోస్యులరప్పించి వారలంజూచి క్రోదంబడరు చందంబున.

సీ॥ చిలువ జాతకఫలము గీ తొలుత మీరొడివిన
పలుకు నిజమని యిల గీ పతికి సుతుడు
బుట్టెనంచును జెప్పి గీ భూమెల్ల చాటించి
పూయని పూంతపై గీ బూసి యొక్క
విధమున సౌరాష్ట్ర గీ విభుసుతను దెస్తినా
సతి భోగినెత్తుకెటు గీ జనెనొగాని
ఇప్పుడా సతి తండ్రి గీ యిచటికి వచ్చి నా
సుతను అల్లుని నేడు గీ జూపుమనుచు
నున్నవాడతని కేమని గీ మిన్నుదిట్టి
అనృతములు బలికి నాకవ గీ మానమిపుడు
తెచ్చితిరిగద మిము తెగ గీ నాజ్ఞసేయ
వలెననిన వినియనిరి న గీ వ్యసుద సురలూ.

వ. ఇట్లుపలికిన బుద్ధిమతిమంత్రినింజూచి, నవ్వి ప్రోత్తములు రాజకుమారుని జాతకంబు పరిశోధించగా, లగ్నాధిపతి కేంద్రమందువుండి. బృహస్పతి దృష్టిగలిగినందువల్ల, పదియవస్తానము మీనమై అందున రాహువుండేటందువల్ల,

చంద్రునకు కేంద్రమందుండి బృహస్పతి ఉచ్ఛక్షేత్ర మందు బుధునితో బలాఢ్యుడుగా నుండినందువల్ల, వ్యయ మందు శుక్రుడు బలాఢ్యుడుగా వుండ, లగ్నాధిపతి వుండే రాశ్యాధిపతి దశమకేంద్రమందు వుండ, దివ్యతీర్థ స్నానంబువల్ల ఇరువదో సంవత్సరంబున రాజలక్షణంబులు గలిగి, దేవేంద్ర సమానుడౌనని నిర్ణయించి, ఆరూఢ ఉదయ అంశచక్ర అష్టవర్గ గోచారఫల దశఫలాదులు చూచి దృఢమతులై.

శు ర చ జం పె.

చింతింప పని లేదు - మీకు ♦ మాతో
రంతేల వినుము మా - పలుకు. ౧

పతివ్రతా రత్నముతో - గూడీ ♦ రాసుతుం
డధిక దశములతోడ - గూడి. ౨

పట్టణ సమీపమున - వచ్చీ ♦ అతఁడు
గుట్టుతోనుండు ప్రియ - మెచ్చీ. ౩

మందహాసంబుతో - సభకూ ♦ వచ్చునే
డందముగ కనుబడును - మనకూ. ౪

వచ్చికాశ్మీర భూ - మెల్లా ♦ యేలు
హెచ్చైన కీర్తి విల - సిల్లా. ౫

ఇందు కనుమానంబు - లేదూ ♦ మీకు
సందేహ మింతైన - వలదూ. ౬

ఇష్టులకు లన్నృతంబు - లైనా ♦ మమ్ము
తప్పకాజ్ఞయు జేయు - మనినా. ౭

వ. అని దృఢమతులై విప్రులుబలికిన శాస్త్రోక్తులు విని బుద్ధి మతిమంత్రి వారలందోడ్కొని సకల పరివారజన సమేతంబుగా ధర్మాంగదుండు వచ్చి రత్నాంగద మహారాజు నుంగని.

త్రి పు ట.

కరులు రధములు - తురగములు నం
బరము లాభర - ణములు మణులును
విరులు పరిమళ - వస్తువులు జం
బీరములునూ. ౧

కరము సంతస - మంద రత్నాం
గదునకును కా - నుకలుగా నిడి
హర్షముతో ఆ - లింగనము జే
సవనివిభుడూ. ౨

సరస యిరువురు - నుండి సౌఖ్యా
సౌఖ్యములు వే - ర్వేర నడిగియు
ధరపతితో ర - త్నాంగదుండా
తరిని బలికె. ౩

నీసమానం - బైనరా జే
దేశమున లే - దనగ విని నే

నీసుతుని క - న్నులను జూడక
నాదుసుతమా. ౪

పరిణయుం బొన - రించి బంపియు
పండుగలకును - పరువములకును
అరసి బిలువగ - లేదు కూఁతురి
నల్లు నెపుడుగ్. ౫

ధారుణీ భా - రమున దగిలియు
శౌరి నే ని - చ్చటికి వచ్చుట
తీర దాయెను - సుతను గని బహు
దినములాయెగ్. ౬

అల్లుఁడేడిపు - డిందు రాడే
నెల్లవరిశలు - దెస్తి నల్లుని
వుల్లమలరగ - బంపవలె మా
వూరి కతనిగ్. ౭

వ. అని ఇట్లు రత్నాంగదుండు బలికిన విని ఖిన్నతముఖుండై ధర్మాంగదుండు విప్రులు బలికిన శాస్త్రోక్తలం దలంచి రంగనాథుని అంతరంగమందుంచి బంధువిహిత క్రమంబున.

జంపె.

విన్నపం బవధారు - వీరాగ్రగణ్యా వో
నన్ను మన్ననజేసి - నాతప్పుగావూ ౧

జెప్పెదను విను నేను - జేయు తప్పెల్లి పుడు
ఒప్పుకొను మీ వేళ - ఒద్దిక గు మనకుఁ. ౨

నలువ రాసిన రాఁత - నులిసినను చెడదు నే
తొలుత నే పాపములు - తొడరి జేసితినో. ౩

తనయుండు బుట్టకొక - దందశూకము బుట్టె
వనిత గర్భమున నే - వగచి శాస్త్రిలనూ. ౪

జేరి వార్నిశు జనన - మేర జెపుడన వారు
నారివల్లను పాము - నరరూపు గలిగీ ౫

భూమెల్ల నేలునని - భూసురులు వినుపింప
భూమెరుగ బడ మంత్రి - పుత్రుడని జాటీ. ౬

అపకీర్తి పాపమీ - ముదిత దేవల దనగ
విపరీతబుద్ధిచే - వెలది నిటు దెచ్చెఁ. ౭

అచ్చెలిని సుతుడనుచు - మచ్చికతో మనుప నా
మచ్చకంఠియు పాము - మగడనుచు దెలసీ. ౮

వగచి పామెత్తుకొని - యరుగవలదన వినక
జగతినొంటిగ నరిగె - జననాద యిట్టి. ౯

వివరంబులును నీకు - వివరించె దెటులనియు
వివరించకుంటి నని - వివరించి యతడూ. ౧౦

నేను జేసిన తప్పు - నీతొ జెప్పితి దయను
మానసంబున దలచి - మన్నింపుమనినా. ౧౧

వ. ఇట్లు ధర్మాంగదుండు విన్నవించిన విని రత్నాంగదుండు తనలో తాను.

త్రిపుట

ఎంచిచూడఁగ - యితనియందొక
వంచనించుక - లేదు గావున
మించనాడఁగ - తగదు భూపతి
మంచివాఁడు, ౧

జాతకము శో - ధించి సర్వము
నాతివల్లను - పురుషుఁడగునని
యీతరిని బలు - కఁగ నెంతటి
జ్యోతిఋషులో. ౨

బొపలాడిన - పలుకు నిజమని
పాపమనకను - బుద్ధిమతి దా
పాపనేమని - దెచ్చె మంత్రే
పాటివాఁడో. ౩

ఎల్లపనులును - చక్కనాయెను
వుల్లములు నొ - వ్వఁగ నాడిన
అల్లునికి ఆ - యాసమగునో
వుల్లమునను. ౪

మాటలేటికి - సుతను అల్లుని
నేటికిచటికి - దెస్తిగద యీ
బూటకము గని - దెలసి జెప్పితె
బుదులె విప్రుల్. ౫

వ. అని దలంచి వెండియు తనమనంబున.

గీ. లోకనీతికి తగినట్టి ♦ పోకొకింత
చెప్పి జూపఁగవలెనంచు ♦ చిత్తమెంచి
ఉదరిపడి చూచి గర్వించి ♦ హుంకరించి
పలికె ధర్మాంగదా మహీ ♦ పతియె నీవ్రా.

వ. అని మఱియు.

అటతాళం.

సుతుడు నీకే – లేదె నీమది
కపటమెంచీ – అహికిసి
ఇతరబిడలను యిటుల – తగలిడ
పతికి తగవే. ౧

కుచ్చితుడవయి – ముచ్చుమాటల
తుచ్ఛపనులూ – జేస్తివి
ముచ్చువేగా – కీవు ఒక భూ
మేలు పతివా. ౨

చదువులును శా – స్త్రములు నిజమని
మదిని దలచీ – యీ పను
లదయుడై రొఁటు – జేసితివి తుద
మొదలెరుగకా. ౩

బుద్ధిలేకను – పదసిరము సహ
నరిసితేనే – ఎటుఁవలె

పెద్దయగునే - యతడు పీతిరి
గెద్దగాకా. ౪

అనెడి రత్నాం - గదునిమది గని
ననిరి విప్రుల్ - వినుమని
కనలి యిటులన - దగునె రత్నాం
గద మహీశా. ౫

మంచిదిది తుద - మొదలెరిగినటు
వంటివాఁడే - నీవును
మించనాడగ - తగదు నీకిది
కొంచెమగునూ. ౬

జనపతికి గురు - తాత్మ నొక్కటి
చెప్పటొకటో - నీకే
ఘనత లోదవును - మనుజ వరునే
మనగ వలదూ. ౭

కౌతుకంబున - సుతను అల్లుని
హితవు మీరా - దోడ్కొని
అతిశయంబుగ - దెచ్చి దాఁచితె
కుతలయేశా. ౮

ఎదురు తన్నును - యెరుగకేటికి
వదరెదవు నీ - వనినను
మదిని చోద్యం - బంది విప్రుల
మాట వినియూ. ౯

తిన్న కూడును - కన్న కలయును
నన్ని దెలసీ - జెప్పెడి
ధన్యులని తన - మదిని దెలసియు
తిన్నగనియెఁ. ౧౦

నాల్గు లక్షల - జ్యోతిరిష కర
మామలకమూ - రీతిరు
నాల్గు అక్షర - ప్రజ్ఞలరసిన
నాదులారా: ౧౧

వ. అని తనకపటంబు తెలిసి పలికిన పలుకులువిని సంతుష్టాం
తరంగుడై రత్నాంగదుండు విప్రులంజూచి.

ద్వి ప ద.

సకలంబు దెలసిన - సర్వజ్ఞులార
వికలత్వమున నేను - వినుపింతు నొకటి
వినుడి ధర్మాంగదు - విధము మీామదికి
ఎనసియున్నదె పాము - గని కొడుకంచు
జగ మెరుగ చాటించి - సఖి లక్షణములు
జగతీసురుల బంపి - చాలపరికించి
తనయుడంచును - మంత్రి తనయునింజూపి
నను మోస బుచ్చియు - నాకూఁతు దెచ్చి
మనుపవలె తనయింట - మనుపలేకున్న
ననుపవలె నామెడకు - నాతినొంటిగను

వనమునందోలి యీ - మనుజేశునకును
ఎనసి కంటికి నిద్ర - యెటువలె వచ్చె

మంత్రిదాయెట్టి సా - మర్థ్యుడో యిట్టి
తంత్ర మెంచెగదిది - తగు తగదనక
సిద్ధవిచారుండు - బుద్ధిమతి మంత్రి
బుద్ధిలేకీపతికి - కొద్దేల దెచ్చె

ఇప్పుడీపతినిన్ని - జెప్పవలె నంచు
జెప్పితి కుత్తమని - తప్పుబట్టకుడి
వనమున కేఁగి నా - తనయు యిలగలుగు
ఘన పుణ్యనదులెల్ల - గనియందు గ్రుంకి

తిరుపతులెల్లను - తిరిగిసేవించి
దురిత హరుండైన - నరహరికి మ్రొక్కి
బ్రహ్మగుండమునందు - పాముతోమునుగ
బ్రహ్మజనకుని కృపను - భావజుడనగ

నాగరూపము బాసి - నరరూపు గలుగ
వేగ దోడ్కొనివచ్చె - వెలది నాయెడకు
వచ్చి యివ్విధమెల్ల - వరుసగా నాతో
విచ్చి జెప్పగ వింటి - విభుధాఖ్యులార

వారినిందోడ్కొని - వచ్చితిచ్చటికి
మీరు బలికినబలుకు - మిధ్యగాదనిన
అప్పుడమీసురు - లారాజుజూచి
జెప్పితివిదియెల్ల - సిద్ధంబుగాని

ఇప్పుడేమనవలదు - ఈశానుకైన
ధాతవ్రాసినవ్రాఁత - తప్పింపదరమ
నాతివిధి వశమిది - నననేటి కోరుల
ఇందిరకైనయైన - యింతి నీపుత్రి

సుందరి త్రైలోక్య - సుందరీ మణియు
పతివ్రతా తిలకంబు - పరమకల్యాణి
కతులితంబుగ కోర్కె - లన్ని సిద్ధించె
ఏఁటికి యిక పలు - మాటలాడినను

మాట నిలుచునుకాల - మరుగు భువిలోన
ఆఁడబిడ్డలను గ - న్నట్టివారిట్లు
వీడనాడగరాదు - పోడిమిగాదు
నీపుత్రినల్లుని - నిటుదెమ్మటనిన

వేపోయి యిరువుర - వేడుకలలర
భూపాలుఁ డల్లుని - పుత్రి తోడ్తెచ్చి
చూఁప ధర్మాంగదుఁడు - చూచితాననియె.

వ. ఇట్లు రత్నాంగదుండు అల్లునింగూతురినిం దోడ్కొనివచ్చి చూడుండని చూఁపిన నవ్వధూవరులంజూచి అనుమానా తిశయంబున ధర్మాంగదుఁడు రత్నాంగదునితో.

అటతాళం.

కోమలియు నా - కోడలా యీ
కోమరు డెవడో - కొడుకని

యేమనుచు యే - నోట బలుకుదు
పామునుగనీ. ౧

పుట్టినాతని - నీదు పుత్రే
పుట్టలోను - బెట్టెనొ
పుట్టనాతని - పుత్రుడని నే
నెట్టులనుదూ. ౨

యాడవానినొ - దెచ్చి నీ వి
ట్లాడ దగునే - కొడుకన
నాడు నగరం - బెల్ల నగునే
వాడి చెడునే. ౩

అనిన మాటను - గనియు వినుమని
వనిత బలికె - నామది
గనియు నీవిటు - లనగదగునే
మనుజనాధా. ౪

వనజనాభుం - డొక్క డెరుగును
వగల బొందా - నేలని
అనఘ నగరము - గడచి యతియై
చనినది మొదల్. ౫

అవని గలిగిన - పుణ్యనదులె
ల్లరసి గ్రుంకి - నైమిశ
భవనమున కే - నరుగ నాతో
బలికిరి ఋషుల్. ౬

కొన్ని దినములు - నరుఁగ నురగము
వన్నె మీరా - నరుడయి
పన్నగా భూ - మేలు బొమ్మని
విన్నవించా. ౭

కర్మరహితము - జేయు తిరుపతు
లన్ని జూచీ - కడపట
ధర్మపురికే - నరిగి నరహరి
దండ జేరీ. ౮

వనట నొందియు - బ్రహ్మగుండం
బునను నురకా ♦ బోయిన
వనిత బడవల - దనియు నంబర
వాణిబలికెఁ. ౮

గీ. పాము గళమున జుట్టుక ♦ బ్రహ్మగుండ
మందు మునిగిన మనుజుడై ♦ మహిని యేలు
నురకవలదన్న నేనపు ♦ డురగమెత్తి
అరుత జుట్టుక బ్రహ్మగుం ♦ డమునమునుగ.

జంపె

అంగజుని జనకు శ్రీ - రంగనాధుని కృపను
అంగజుని బోలునా - సంగడను నిలచెఁ. ౧

నిలిచినతిశయమొంది - వలసి నేనిచ్చటికి
చెలువునితోరాగ నను - జనులు నమ్మరనీ. ౨

ఎరిగి నా తలి దండ్రి - యింటికితనితో నేను
అరిగి నా వృత్తాంత - మంతయును జెప్పి. ౩
ఇచ్చటికి యిరువురై - వచ్చుటయు తగదనియు
వచ్చితిమి యిపుడు మా - వారితో గూడి. ౪
అనిన ధర్మాంగదుడు - వినియునచ్చెరువంది
వనిత వినుమనియు న - మ్మనుజవరుడనియె. ౫

వ. ఇట్లు బలికిన త్రైలోక్యసుందరినింజూచి ధర్మాంగదుండు..

త్రిపుట

బోగి యే లో - కములనైనను
పురుషుడగునటె - యేమిచోద్యం
బాగడంబిటు - కల్లలాడకు
మబల నీకూ. ౧

సాక్షియెవ్వరు - విన్నవారిది
సత్యమందురె - గగన వాణిని
సాక్షిగా బలి - కింపు మీ సభ
జనులు వినగా. ౨

నాడుబలికిన - గగనవాణియు
నేడుబలికిన - యిప్పుడును నీ
వాడినట్టి - మాటలన్నియు
చూడ నిజమే. ౩

లేకయున్నను - లోకమున కీ
పోకలెల్లను - బోలదన త్రై
లోక్యసుందరి - యనియె భూపతి
జోక దెలసీ. ౪

పాలమున కర - ములను జేర్చియు
పాలవారధి - శయన హరి గో
పాల దశరథ - రాజ నందన
భక్తలోలా. ౫

వారిజాధర - గరుడ గమన
మురారి శ్రీధర - రంగనాయక
నీరజాక్ష ము - కుంద మాధవ
నీలవర్ణా. ౬

నన్ను గావుము - నిన్నె నమ్మితి
మున్నినన నటు - నంబ్రవాణిని
పన్నుగా బలి - కించవే వో
పరమ పురుషా. ౭

వ. అని త్రైలోక్యసుందరి భగవంతుండైన శ్రీరంగనాయకుల నుతియించి కంటికి మనంబునకు నందని గగనవాణినింగని.

సీ॥ వనజాక్షి ఆకాశ వాణిని వీక్షించి
అలినీలవేణి ఆ కాశవాణి

ధర వేదశాస్త్రము ॥ లర్ధము ల్నిజమైతే
తరణి విధులుడువులు ॥ తథ్యమైతే
రంగడీధరకెల్ల రక్ష ॥ కర్తయునైతే
ధరపంచ భూతము ॥ ల్తథ్యమైతే
శేషుడే మానవ వి ॥ శేషుడైనది యైతే
వారక నే పతి ॥ వ్రతయునైతే

గీ॥ నాఁడు బలికింది నిజమైతే ॥ నేఁడు నీవు
వన్నెమీరంగ యీ సభ ॥ వారు వినగ
బలుకు మిపుడన్న మానవ ॥ భాషలలర
బోరునను మ్రోర్పడగ నశ ॥ రీరి బలికే.

షు రు చ జం పె.

వినుము ధర్మాంగదిల ♦ పాలా ॥ నీకు
అనుమానమేల ఈ ♦ వేళ. ౧

నీ సుతుండీతడో ♦ గానీ ॥ ఎన్న
నీసతియు పతివ్రతో ♦ గానీ. ౨

ముద్దియాడిన మాట ♦ లన్నీ ॥ ఇపుడు
తథ్యమగు మిథ్యగా ♦ దన్నీ. ౩

సీత, ద్రౌపతి, తార ♦ హల్యా ॥ లోక
మాత, శివపత్ని! యను ♦ సూర్యా. ౪

రతి, యరుంధతియు, సా ♦ విత్రీ ॥ చంద్ర
మతి, సతుల కెన రాజ ♦ పుత్రీ. ౫

సతి సత్యవతి యంచు ♦ నెంచూ ॥ వేరె
మదినెంచ అఘము సి ♦ ద్ధించూ. ౭
చెలి జనని జనకులకు ♦ జెందూ ? కీర్తి
కులము నీ దభివృద్ధి ♦ బొందూ. ౭
ఉల్లమున నామాట ♦ బట్టూ ॥ భూమి
కెల్లితని పట్టంబు ♦ గట్టూ. ౮
చిత్రాంగదుండ నెడి ♦ పేరూ ॥ నీను
పుత్రునకు భూమి పెం ♦ పలరూ. ౯

గీ॥ అనియు అశరీరి బలికిన ♦ అప్సరసులు
గురిసి రప్పుడు జోరున ♦ విరుల వాన
దేవ దుందుభులును మ్రోసె ♦ ఆకసమున
కిన్నరాదులు బాడిరి ♦ గీతములునూ.

వ. ఆసమయంబున సభాసీనులందరు అశరీరి పలుకులు విని చోద్యంబునొంది పరమసంతసంబునుబొంద, ధర్మాంగదుండు విప్రులుబలికిన శాస్త్రోక్తులకున్ను, బుద్ధిమతి మన్త్రి యోచనలకున్ను, త్రైలోక్య సుందరి పతివ్రతా మహిమలంబులకున్ను, ఆకాశవాణి బలికిన వచనంబులకున్ను, సుతుని సౌందర్యాతి శయంబులకున్ను, పరమహర్షంబునం బొందె నయ్యవసరంబున,

జంపె.

అపుడు రత్నాంగదుడు – ఆనందమొంది సుత

సఫలముగ ఘనత నా - కిపుడు దెచ్చితివీ. ౧
కన్న తలిదండ్రికొక - వన్నె దెచ్చితివి నీ
కెన్నిలోకముల సతు - లెన్న సరిగానా. ౨
సుతను బహువిధములను - అతిశయముగా బొగడి
కుతలేశుడును శా స్త్రి - వితతులకు నపుడూ. ౩
మణుల హారములు మ - త్తేభ రథములు తురగ
మణులంబరములు స్వ - ర్ణము లందలంబుల్. ౪
ఇచ్చి వారల మనసు - మెచ్చులాదవగ జేసి
మచ్చికలరగ బుద్ధి - మతి మంత్రిజూచీ. ౫
బుద్ధించుకయు లేక - ఇద్ధరణి పతికీవు
కొద్ది దెచ్చితివంచు - బుద్ధినెంచితినీ. ౬
దేవుడని మదిలోన - భావించవలెగాని
భూ వలయమున నిన్ను - బుద్ధిమతి మంత్రీ. ౭

ఇట్లు రత్నాంగదుండు పుత్రియైన త్రైలోక్యసుందరినిం గొనియాడి శాస్త్రికులకు బహుమతులొసంగి బుద్ధిమతి మంత్రినింబొగడి వియ్యంకుని నెయ్యంబులు బలికి సంతోషంబులం బొందనప్పుడూ.

త్రి పు ట.

సుందరియు త్రై - లోక్యసుందరి
మందహాసము - తోడ మామకు
పొందుగా మ్రొ - క్కెనను నతడిం
పొందనె త్తి. ౧

పుట్టినింటికి - లోక మెరుగగ
పూర్తిగా న - త్కీర్తి దెస్తివి
మెట్టినింటికి - వృద్ధి దెస్తివి
మెలతనీవూ. ౨

కోడల ననిను - తగదు నాకుల
గోత్రములకే - దేవతవు గా
కీడు నీకే - జాడ నతి చూ
డిలను గానా. ౩

అనుచు కోడలి - నాదరించియు
జనపతియు ర - త్నాంగదుని గని
వినుము నీసుత - వల్ల నురగము
తనయు డయ్యెఁ. ౪

జగతి నీతో - వియ్యమందగ
నఫల మొందెను - కులము జన్మము
అగణితంబుగ - కీర్తి గలిగెను
అచ్యుతుకృపఁ. ౫

వ. ఇట్లు ధర్మాంగదుండు సుందరీమణియైన త్రైలోక్యసుంద రిని వియ్యంకుని వినుతించి సచివాప్తబంధుజనసమేతం బుగా కొడుకును కోడలిని వియ్యంకునిం దన నగరికిం దోడ్కొనివచ్చిన త్రైలోక్యసుందరి అత్తగారికడ కరుగు దెంచి, భయభక్తితో నమస్కరించిన కోడలినింగని య గ్గుణవతి లేవనెత్తి, కౌగలించి, అక్కునజేర్తి త్రైలో

క్యసుందరి పొందిన ఇడుములకు తనమది క్రందిగుంది మి గుల పొగిలి మగుడి తమ చక్కని కార్యసిద్ధికై అపరి మితానందవెల్లువందోగి నాకులవేల్పే కోడలై తివని కొని యాడి షడ్రసాన్నపేతంబుగ పంజ్క్తిం బ్రసాపడి చందన కుసుమ తాంబూలంబుల సకలజనంబుల సంతోషంబులం బొందించి ధర్మాంగదమహారాజు శాస్త్రప్రవీణ చాతుర్య ధుర్యులైన విప్రులంజూచి.

ద్విపద.

ఓమహీ సురులార - ఓపుణ్యులార
మీమాట బద్ధతి - మేలొందెనన్ని
ఈమధుమాసంబు - యోగ్యంబుగాన
భూమికి రాజుగా - పుత్రున కిపుడు
అభిషేక మొనరింప - అందుకు తగిన
శుభదినంబును లెస్స - జూచి జెప్పుడన
నక్షత్ర తిథి వార - లగ్నంబు లరసి
ఆక్షణంబున బల్కి - రవనిసుర లపుడు
చిత్రాంగదునకును - చైత్రమాసంబు
పాత్రమౌ పుష్యమి - భానువారంబు
సింహలగ్నము దశమి - సిరులలర రేపు
సింహాసనమునుంచ - జయమంచు విప్రు
లాడువ ధర్మాంగదుం - డుత్సాహమంది
కొడుకు కోడలినపుడు - కోరి రప్పించి

పుణ్యాహవాచనం - బొనర నుపవాస
పుణ్యసంకల్పంబు - పూని చేయించి

చెలువొంద కాశ్మీర - జనపతి యపుడు
బలికెను తనమంత్రి - పతిమోము జూచి
పంచకల్యాణియు - భద్రసామజము
అంచితచిక్కంబు - లాలవట్టములు

జగజంపు గొడుగు - వింజామరంబులును
అగరుగంధము పట్టు - పాయుధము సూర్య
పానులు ధవళాత - పత్రంబు గృతము
తేనె జాజులు పాలు - తెల్లని పూలు

కలధౌత కలశము - ల్కనకకలశములు
పులితోలు నవరత్న - భూషణంబులును
లక్షగోవులు పది - లక్ష తురగములు
లక్ష యేనుగలును - లక్షపల్లకులు

దక్షిణలకు దశ - లక్షల ధనము
అక్షయముగ పుత్త - డంబరంబులును
తెప్పించు విప్రుల - దేశాధిపతుల
రప్పించు విప్రుల - లక్ష విప్రులకు

భోజనంబొనరించు - పురము గోపురము
రాజవీథి నగళ్లు - రమణ గైచేయు
మని చెప్ప నాబుద్ధి - మతిమంత్రియపుడు
అనువుగా సమకూర్చె - నన్నివస్తువులు

ఘనుల పండితవిప్ర - కవుల భూపతుల
ననువొంద రప్పించ - నంపియు భటుల
పురము శృంగారింప - బోరున నవుడు
సరగున నప్పురి - చాటించె నంతా.

జంపె.

కనకపురమునగలుగు - జనులు సంతసమంది
మనమలర వార్వారి - మందిరంబులనూ. ౧
కలయ కస్తురిపన్ని - టలికి రేఖలుదీర్చి
కొలది ముత్యముల - మ్రుగ్గులు బెట్టువారూ. ౨
చెలువార సదనములు - చిత్రించువారలును,
నలిమీరి మణితోర - ణము లెత్తువారూ. 3
విరుల చప్పరములును - విరచించు వారలును,
పురవీధి కేతనం - బులు నిల్పువారూ. ౪
కలువడంబులు డంబు - గా గట్టువారలును
కలిమి నొండొరులర్థి - కై జేయువారూ. ౫
అభిషేక సుముహూర్త - మరయుచుండెడివారు
విభుని ధర్మాంగదుని - వినుతించువారూ. ౬
ఇలువేల్పులకు పూజ - నిల నిచ్చువారలును,
కలకొలది దానము - ల్గావించువారూ. ౭
అరయంగ నిస్సాణ - భేరీమృదంగములు
మురజ శంఖాదులును - మొరయించువారూ. ౮

పొలుచు దివ్యసుగంధ - పుష్పాక్షతారతులు
వెలయ చేతుల నెత్తి - విలసిల్లువారూ. ౯

పరిమళాభరిత ధూ - పాదీప ధూమముల
వర రాజమార్గముల - వాసించువారూ. ౧౦

చిత్రాంగదుండె కా - క్షీరభూమికి నెల్ల
పాత్రుడే యగునంచు - బలికేటివారూ. ౧౧

వ. ఈప్రకారంబున పురలక్ష్మి ఉత్సవానందకోటులం బొందు చుండ ధర్మాంగదుండు చూచి సంతోషాతిశయంబులం బొంద నాసమయంబునా.

సీ. అంగ వంగ కళింగ ॥ సింగళ బంగాళ
కొంకణ కుంకణ ॥ కోసలాంధ్ర
మగధ మత్స్య మరాట ॥ మాళవ మలయాళ
చోళ నేపాళ ॥ కేరాళ గౌళ
పాంచాల బర్బర ॥ పాండ్య విదర్భాది
దేశాధిపతులు నే ॥ తేరవారి
కెదు రేగి తోడ్తెచ్చి ॥ ముదమొంద విడుదలం
దుంచి భూపతియు ॥ దుర్గాధిపతుల

తే. అతిరథుల సమరథుల మ ॥ హారథులను
పండితుల గురుల గాయక ॥ బ్రాహ్మణులను
కవుల పాఠక వంది మా ॥ గధ పురోహి
తాష్ట పౌరుల గణికుల ॥ నఖిలజనులా.

వ. ఇట్లు సకలజనుల సభామంటపంబునకు రప్పించి, ధర్మాంగదుండూ.

త్రి పు ట.

ధరపతుల ర - ప్పించి వారికి
తగిన పీటిక -లిడిన వారలు
కరము సంతస - మంద నుండిరి
ధరణి పతులూ. ౧

వేడుకగ చి - త్రాంగదుడు తన
వెలదియును ప - న్నీట జలకము
లాడి దివ్యా - భరణ వస్త్రము
లలర దాల్చి. ౨

మరువములు కురు - వేఱు దవనము
విరుల సరములు - శిరమునందిడి
పరిమళ సుగం - ధములు నలదిరి
సిరులలరగా. 3

పంచవిధ వా - ద్యములు మొఱయగ
మించి బహువిధ - తేజములరగ
అంచితంబుగ - విప్రులాశీ
ర్వాద మొసగా. ४

వందిమాగధ - కవులు బొగడగ
ఇందు వదనలు -నాట్య మాడగ

సిందు గోష్టం - బనగ కటికులు
సందడింపా, ౫

భూసురులు సా - మాది వేదము
భాసురంబుగ - చదువమణి సిం
హాసనంబున - సతిపతులనిడి
భూసురవరుల్. ౬

ప్రేమముతో పు - ణ్యాహవాచన
నేమమలరగ - జేసి క్రమమున
హోమములు జే - యించి రభిషే
కం బొనర్చి. ౭

ఉంగరము సుతు - కేలనిడి యు
ప్పొంగి రత్నకి - రీటమును తల
రంగుగను ధ - ర్మాంగదుం డిడి
యింగితముగా. ౮

భూతి నీతియు - ఖ్యాతి వెలయగ
భూపతులు భూ - జనులు బొగడగ
భూతలం బిం - పొంద నేలుము
పుత్ర యనినా. ౯

గీ. అపుడు విప్రులు గంద ♦ పుష్పాక్షతలను
మంగళాష్టక వేద మం ♦ త్రములు చదివి
మకుటమున నుంచి దీవించ ♦ మగువలపుడు
శాశబెట్టిరి ఆ సభా ♦ జనులు చెలగా.

వ. ముత్తైదువలు హారతులెత్తి పాడిరట యెటువలెనూ.

## మంగళము.

శ్రీమన్మహాలక్ష్మి ♦ చెలగుమాణిక్యపురి
భూమీశు పుత్రివై ♦ పొలుపుమీరా
సాముద్రికమునందు ♦ చెలగు లక్షణములతో
రామామణవ బరగు ♦ రమణి కిపుడూ
జయమంగళం నిత్య ♦ శుభమంగళం. ౧

యతి వేషధారివై ♦ సతులెల్ల కొనియాడ
శతలమెల్లను దిరుగు ♦ కోమలికినీ
సతిశిరోమణివైన ♦ సౌందర్యవతిశురగ
పతికి సతి వైనట్టి ♦ పణతికిపుడూ
జయమంగళం నిత్య ♦ శుభమంగళం. ౨

ఖగగమను కృపను గా ♦ తమినదీ మొదలైన
జగతిగల తీర్థముల ♦ సరసమునిగీ
వగలెల్ల దీర వా ♦ ణీశుగుండము నహిని
మగనిగా జేయించు ♦ మగువకిపుడూ
జయమంగళం నిత్య ♦ శుభమంగళం. 3

ఇందిరాగుంధతికి ♦ యించువిల్తునిసతికి
ఇందుశేఖరు సతికి ♦ ఇలసతికినీ
పొందికగు కనకపురి ♦ భూపాలు సుతుసతికి

అందమా త్రైలోక్య ♦ సుందరికినీ
జయమంగళం నిత్య ♦ శుభమంగళం. ౪

సురులు నరవరులు భూ ♦ సురులు ముని గంధర్వ
వరులెల్ల గొనియాడ ♦ వగని యిపుడూ
ధరయెల్ల నేలించు ♦ త్రైలోక్యసుందరికి
ధర హాసిత వదనుడగు ♦ ధరణిపతికీ
జయమంగళం నిత్య ♦ శుభమంగళం. ౫

వ. ఈప్రకారంబున చిత్రాంగదునకు పట్టంబుగట్టి ధర్మాంగదుండూ.

జంపె.

రత్నాంగదుం డాది - రాజరాజులకునవ
రత్నాభరణ మంబ - రంబులును యిచ్చీ. ౧
భోజనంబులుబెట్టి - పుష్పముల గంధముల
పూజించి వారలను - పురములకుబంపీ. ౨
భువి సురోత్తములకును - పూజ లొనరగజేసి
అవిరళంబుగ దాన - మర్థితోనిచ్చీ. 3
కవులకును వందిమా - గధ పురోహితులకును
సవినయంబుగను స - త్కారంబొసంగీ. ౪
నాటకులకును గణిక - బోటులకు నటులకును
పాఠకుల కటికులకు - పసదనంబొసగీ. ౫
అన్నంబు బెట్టించి - అఖిలజనముల బంపి

పన్నుగా సచివునితో - బలికె భూవిభుఁడూ. ౬

వితరణల యోచనల - వినయగుణముల బుద్ధి
మతిమంత్రియున నీకె - క్షితలమున జెల్లుగా. ౭

అనుచు సచివుని బాగడి - ఘనులజోస్యులకపుడు
కనకాభిషేకంబు - లొనర జేయించీ. ౮

పంపించి వారలను - ఇంపొంద వారలతో
పెంపలరగా నుండె - సొంపుతో విభుఁడూ. ౯

ద్విపద.

అపుడు చిత్రాంగదుం - డధికనీతులను
నిపుణుఁడై మంత్రితో - నిలయేలెనపుడు
అందముగ త్రైలోక్య - సుందరింగూడి
డెందంబునందు నా - నందంబునొంద
తల్లిదండ్రుల నాద - రము లుల్లసిల్ల
ఉల్లంబు చల్లగా - ఊరడింపుచును
చోరుల జారుల - శోధించిబట్టి
వారికిదగినాజ్ఞ - వదలక బెట్టి
రాజాధిరాజులు - రంజిల్లిబాగడ
రాజసూయాగముల్ - రమణతో జేసి
అశ్వమేధానేక - యాగముల్ జేసి
విశ్వంబులోన శా - శ్వతకీర్తిబడసి

సిరులుల్లసిల్ల - చిత్రాంగదుం డవని
పరమసంతోషమున - ప్రజలపాలించె
అని గౌతమాముని - హల్యతో జెప్ప
వినిసంతసించెనా - వృత్తాంతమెల్ల
శ్రీరంగపతిపేర - శ్రీపతిపేర
సారంగధరుపేర - చక్రధరుపేర
గరుడగమనునిపేర - మరుజనకుపేర
ఉరగశయనునిపేర - నరహరిపేర
చెన్నకృష్ణునిపేర - వెన్నునిపేర
తెన్నరంగం పొన్న - డేశునిపేర
అక్షరంబులు మెనిమి - దర్థము దెలిపి
రక్షించు శ్రీభట్ట - రార్యశిష్యుండు
చరమాదికారియౌ - గురుసామికరుణ
కరుణ జలనిధు లాంధ్ర - కవిజనులకరుణ
క్షత్రియ వెంకట - సార్వభౌమునకు
పుత్రు వీర్రాఘువ - బుధశిరోమణికి
తనయుండు వరదభిః - ధాముడొల్లుట్ల
అనఘు మక్కాన తిరుమ - లార్యులనుమతిని
యక్షగానంబుగా - నాంధ్రభాషలను
యీక్షితిం జెప్పితి - యీపుణ్యచరిత

మెవ్వారు చదివిన - యెవ్వారు వినిన
ఎవ్వారు వ్రాసిన - దవ్వారు నఘము.
ఇష్టకామ్యార్థము - లింపొందగలుగు
కష్టంబు లెడబాయు - గలుగును శుభము

లెందాక భూజలా - గ్నిర్వాయు గగన
మెందాక రవిచంద్రు - లెందాక తార
లెందాక వేద శా - స్త్రింబిల గలుగు
నందాక యీకథ - యనభివృద్ధిబొందూ.

మంగళం మంగళం మహా శ్రీ శ్రీ జేయను.
ధర్మాంగదచరిత్రము - యక్షగానము
సంపూర్ణము.

గద్య.

శ్రీమదాంధ్ర భాషాకవితా విదేయ కశ్యపగోత్ర పవిత్ర విజయనగర క్షత్రియవంశ విచిత్ర భవనామాంకిత కూరపాటి నారాయణ చరణారవింద మరందపానమిళిత పరాయత్తచిత్త సంయుక్త భక్తసిరోరత్న ప్రయుక్త అంబా వరప్రసాద వరదరాజుకవి నిత్యనైమిత్తికానుష్టాన పరంపరాపతి ధర్మవిదేయి పరమపతివ్రత నాంచేరు నామదేయి గర్భ పయః పారావార సుదాకరసదృశ్య సజ్జనవిదేయ
క్షత్రియ్యపుత్ర పరమభాగవతబందు సిరోరత్న

శఠగోపాలరాజు నామధేయ నాయకి నాంచారమ్మ గర్భ
ప్రతిష్ట జేష్టపుత్ర సజ్జనపాదపద్మ సేవితుండైన కస్తూరి
రంగసామిరాజు సర్వలోకోపకార హితంబగు మది
య్యాజనకర్త్యచే రచియింపంబడిన ఈధర్మాంగద
కథా సుధారస చరిత యక్షగానంబును
అదోక్షయ చరణారవింద విధేయుండ
నై శుక్లాబ్ధ భాద్రపదమాస శుక్లపక్ష
గురువాసరె మదియ్యంబగు సారం
బుచే (సర్వస్వామ్యముగ)
అచ్చుకు ప్రచురింపఁ
బడియె.

మంగళం మహాశ్రీశ్రీ జేయను.

అస్మద్గురుభ్యోన్నమః.
అస్మత్పరమ గురుభ్యోన్నమః.
శ్రీమతే రామానుజాయనమః.

వరదాయనమః.

శఠగోపాయనమః.

శ్రీ భట్టర్ తిరువడిగళే శరణం.

సంపూర్ణము.



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 10 | తరువు | తరువై |
| 8 | 19 | బిడ్డ | బిడ |
| 13 | 15 | నలుగురిలోఁ | నలుగురిలో |
| 15 | 18 | వదన | సదన |
| 19 | 17 | తెలుఁగు | తెలుంగు |
| 23 | 3 | సింహాళ | సింగళ |
| 43 | 15 | వీథుల | పీధుల |
| 44 | 7 | వీథుల | వీధుల |
| 61 | 6 | ... | జూడనే |
| 62 | 21 | ... | అడిగిననా |
| 68 | 2 | ... | నన్ను |
| 69 | 6 | వ్రాచె | వాచె |
| 83 | 19 | ... | భవనాశి |
| 84 | 19 | ... | కుద్దాల |
| 85 | 21 | ... | నారి |
| 120 | 5 | మెచ్చైన | ఎచ్చైన |
| 125 | 7 | ... | మత్స్యావ |
| 128 | 8 | ... | నరిగె |